

# వైదిక విజ్ఞానము

హిందీ మూలము:

**శ్రీ పం. శివశంకర కావ్య తీర్థ**

తెలుగు అనువాదము:

**కంపిలి లక్ష్మణార్య**

ప్రకాశకులు:

**గాయత్రీ ఆశ్రమ ట్రస్టు**

ఓ3మ్

# వైదిక విజ్ఞానము : VEDIC SCIENCE

వేద వాఙ్మయములో శిక్షా, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము అను 6 ముఖ్యమైన వేదాంగములు ఉన్నవి. సాంఖ్య దర్శనము, యోగ దర్శనము, న్యాయ దర్శనము, వైశేషిక దర్శనము, పూర్వ మీమాంస, ఉత్తర మీమాంస లేదా వేదాంత దర్శనము అను 6 వేద ఉపాంగములు. వేదములు తర్కమునకు, హేతువులకు, ఉపపత్తులకు వ్యతిరేకములు కావు.

ప్రపంచమున గల మత సాంప్రదాయ గ్రంథములన్నీ తర్కమునకు యుక్తులకు, విజ్ఞాన శాస్త్రములకు భయపడతాయి. ధార్మిక (మత) విషయమున తర్కించుట పిశాచుల పని, మత సాంప్రదాయ విషయములందు విశ్వాసముంచుటయే ఉచితమని మతపెద్దలు తమ శిష్యులను హెచ్చరింతురు. పరమేశ్వరుని పట్ల, ధర్మము (మతము) పట్ల విశ్వాసముంచుట ఉచితమే కాని తమ తమ మతములలో నున్న అసత్య విషయములను కూడా సత్యమని విశ్వసించుట సరికాదు.

మత (ధర్మ) గ్రంథాలు-మత గ్రంథకర్తలు, ధర్మ ప్రచారకులు - మత ప్రచారకులు సమాజ శ్రేయస్సును కోరువారే అయినప్పటికీ వారు విజ్ఞాన శాస్త్రము వైపు అంతగా దృష్టి సారించలేదనే చెప్పాలి. కావుననే వారి గ్రంథాలలో వారి ఉపదేశాలలో ఎన్నో లోపములను మనం గమనించవచ్చును. వారి శిష్యులు కాలాంతరంలో ఆయా గ్రంథాలలో దొర్లిన తప్పులను కూడా సత్యములుగానే భావించి ప్రచారము చేయదొడగిరి. ఈ తప్పిదము వల్లనే దేశమున (ప్రపంచమునకు కూడా) కెంతో హాని జరిగినది.

వేదములట్లు కావు. అవి మత సాంప్రదాయ గ్రంథములు కావు. వేదములలో సత్యమైన విషయములే ఉంటాయి. వేదములు తర్కమునకు, యుక్తులకు వెరవవు, పైగా పలుచోట్ల తర్కించండి! అన్వేషించండి! ప్రశ్నించండి! అప్పుడే జ్ఞానవంతులవుతారని ఉపదేశిస్తాయి. వేదములందలి యిట్టి నిగూఢ ఉపదేశాలు ఒకటి, రెండు ఉదాహరణలతో స్పష్టమగును.

ప్రపంచములో వెలసిన మత సాంప్రదాయ గ్రంథములన్నింటిలో భూమిని గురించిన వర్ణనలు ఎంతో కొంత కాననగును. కాని అవి అన్నియు విజ్ఞానమునకు విరుద్ధముగా ఉండుట వలన నమ్మశక్యములు కావు.

భూమి దేనిపై నిలిచి ఉన్నది? దాని పొడవు వెడల్పులెంత? దాని ఎత్తు లావులెంత? భూమి గుండ్రముగా నున్నదా? లేక బల్లపరుపుగా నున్నదా? భూమికి పైభాగము క్రింది భాగములున్నవా? భూమిపై భాగమున మానవులు క్రింది భాగమున రాక్షసులు ఉన్నారా? రాత్రింబవళ్ళు ఎందుకేర్పడతాయి? 364 అహోరాత్రాల తరువాత మళ్ళీ అవే ఎందుకు పునరావృతమవుతాయి. చంద్రుడు ఎందుకు తగ్గుతూ పెరుగుతూ ఉంటాడు? గ్రహమణమెందుకు వస్తుంది? అనే అనేక సందేహాలకు సమాధానములు తెలుసుకోగోరుతారు. ప్రతి విషయమందు కూడా శాస్త్ర విజ్ఞానమిమిడియున్నది.

నేడు ఆధునిక విజ్ఞాన శాస్త్రము ఎంతో అభివృద్ధి చెందియున్నది. పాఠశాలలో కళాశాలలో ఈ శాస్త్ర విషయములన్నీ నేర్పించబడుచున్నవి. అయినప్పటికీ నేటి వైజ్ఞానిక యుగంలో కూడా మత సాంప్రదాయ గ్రంథాలు మరియు పురాణాలు విజ్ఞాన విరుద్ధమైన, అవిద్యాంధకార విషయాలనే వ్యాపింపజేయుచున్నవి.

వేదములలో చూపబడిన, వేద సమ్మతమైన వైజ్ఞానిక విషయములను వివరించుటలోగల ఆశయము, వేదములనే

తమ సాంప్రదాయములకు మూలమని చెప్పు సాంప్రదాయవాదులు తమ తమ గ్రంథాలలో ఉన్న విజ్ఞాన విరుద్ధ విషయములను సవరించుకొని, వైదిక ధర్మ పథమున పయనించి కళ్యాణకర శుభములను బడయుదురనే ఆకాంక్షయే.

## వేదములలో గల కొన్ని వైజ్ఞానిక విషయములు

**1. భూ పరిభ్రమణము = సూర్యాకర్షణ శక్తి**

**ఓం అహస్తా యదపదీ వర్ధత క్షా శచీభిర్వేద్యానామ్ ।**
**శుష్ణ పరి ప్రదక్షిణిద్ విశ్వాయతే నిశిశ్నథః ॥**

– ఋ. 10.22.14

**విశేష శబ్దములకు అర్థములు:**

**క్షా =** భూమి. నిఘంటువులో (1–1) భూమికి గౌ, గ్మా, జ్మా మొదలగు 21 నామములు పేర్కొనబడినవి. 'క్షా' అనునది అందులో ఒకటి.

**శచీ =** కర్మ = నిఘంటువులో కర్మకు అపః, అప్నః మొదలగు 26 పేర్లు పేర్కొనబడినవి. 'శచీ' అనునది అందులో ఒకటి.

**శుష్ణ =** ఆదిత్యుడు – సూర్యుడు. శుష్ణస్య ఆదిత్యస్య శోషయితు : (నిరు. 5.16)

భూమిపై నుండు రసములను శోషించువాడు – ఆకర్షించువాడు కావున సూర్యునికి 'శుష్ణః' అను పేరున్నది.

**ప్రదక్షిణిత్ =** ప్రదక్షిణము చేయును – తిరుగును.

**విశ్వాయతే =** విశ్వాసము కొరకు – నమ్మకము కొరకు.

**మంత్రార్థము:** యద్ = ఏ, క్షా = ఈ భూమి, అహస్తా = చేతులు లేకుండానే, అపదీ = పాదములు కూడా లేకుండానే వర్ధత = ముందుకు సాగుతున్నదో – తిరుగుచున్నదో – అనగా భూమి కాళ్ళు చేతులు లేకయే ముందుకు సాగుతున్నదని – తిరుగుతున్నదని అర్థము. వేద్యానాం శచీభిః = తెలియదగిన పరమాణువుల చలనము వలన ప్రేరణపొంది భూమి తిరుగుతున్నది. భూమి తనపై నానావిధ పర్వత శ్రేణులను, వివిధ పదార్థాలు, మేఘాదులను, వాటి క్రియా కలాపములకు భంగము కలుగకుండా దేనిచుట్టు తిరుగుచున్నది? అంటే శుష్ణంపరి = సూర్యుడి చుట్టు ప్రదక్షిణిత్ = ప్రదక్షిణ చేస్తూ తిరుగుచున్నది. విశ్వాయతే + నిశ్చిశ్నథః = ఓ పరమేశ్వరా! నీవు మానవుల విశ్వాసము కొరకు – నమ్మకము కొరకు ఇటువంటి ఏర్పాట్లు చేసినావు అని ప్రార్థన.

వేద భాష్యకారుడయిన సాయణాచార్యుని కాలములో ఈ భూ పరిభ్రమణ విజ్ఞానము విలుప్తమగుటచేతను అతనిలో స్వయంప్రజ్ఞ లోపించుటచేతను ఈ మంత్రమునకు ఈ విధముగా వ్యాఖ్యానించియున్నాడు.

**"యద్వా శుష్ణస్యాచ్ఛాదనార్థం హస్తపాదవర్జితా కాచిత్పృథివీ వేదితవ్యా నామసురాణాం మాయారూపః కర్మభిః శుష్ణమసురం వేష్టిత్వా ప్రదక్షిణం యథా భవతి తథా అవస్థితా అవర్ధత తదానీంతాం మాయోత్పాదితాం పృథివీం విశ్వాయతే సర్వ వ్యాపకస్య మరుద్గణస్య ప్రవేశనార్థం నిశ్చిశ్నిథః"**

**భావార్థము:** "అసురులు తమ మాయతో భూమిని సృష్టించి శుష్ణువు మరియు ఇంద్రుడికి జరుగుతున్న యుద్ధములో ఇంద్రుడు ప్రవేశించకుండా శుష్ణువు చుట్టూ ప్రదక్షిణ చేస్తూ ఉండుమని భూమిని ఆదేశించిరి. ఇది ఇంద్రుడు తెలుసుకొని మొదట మరుద్గణములను అక్కడికి పంపెను. కాని అవి అక్కడికి చేరుకోలేకపోయినవి.

అప్పుడు ఇంద్రుడక్కడికి చేరి భూమిని దండించగా అది పారిపోయినది. మరుద్గణములు అక్కడ ఉన్నటువంటి శుష్ణువును ఛిన్నాభిన్నము చేసిరి.”

ఈ భాష్యకారుడు సరళమైన, సులభమైన అర్థమును వదిలి అసంబద్ధమైన, మిథ్యా వ్యాఖ్యానము చేసిరి. భూమి మాత్రమేకాక, నక్షత్రాదులు కూడా స్థిరముగా లేవని ఈ క్రింది మంత్రముతో స్పష్టమగుచున్నది.

**ఓం కతరా పూర్వా కతరా పరాయోః కథాజాతే కవయః కో వివేద ।**

**విశ్వం త్మనా విభ్రతో యద్ధనామ వివర్తేతే అహనీ చక్రియేవ ॥**

– ఋ. 1.185.1

**మంత్రార్థము: అయోః =** భూమి మరియు ద్యులోకము ఈ రెంటిలో, **కతరా+పూర్వా =** ఏది ముందున్నది? **కతరా+పరా =** ఏది వెనకున్నది? లేదా ఏది పైనున్నది ఏది క్రిందున్నది?, **కథా+జాతే =** ఈ రెండు ఎలా పుట్టినవి?, **కవయః కః వివేద =** ఓ కవులారా! దీనిని ఎవరెరుగుదురు? అను ప్రశ్నకు సమాధానముగా **యద్+హ+నామ =** పుట్టిన పదార్థములన్ని ఈ రెంటితోనే సంబద్ధమై యున్నవి. **విశ్వం =** ఈ విశ్వమంతటినీ ఈ రెండే **బిభ్రతః =** ధారణ చేయుచున్నవి. అనగా పదార్థములన్నింటినీ తమతోబాటు తీసుకొని, **వి+వర్తేతే =** విశేషముగా తిరుగుచున్నవి. **అహనీ+చక్రియా+ఇవ =** రథ చక్రము క్రింది భాగము పైకి, పైభాగము క్రిందికి తిరుగునట్లు, రాత్రింబవళ్ళు కూడా ఒకదాని తరువాత ఒకటి వచ్చుచున్నవి. భూమి ద్యులోకములు కూడా అట్లే తిరుగుచున్నవి. ముందు వెనుకలు, క్రింద పైనా అను వ్యవహారము యిందు పనికిరాదు. భూమి, సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు దూర దూరముగా పరిభ్రమించుచున్నందున ఏది పైన, ఏది క్రింద అని చెప్పలేము.

ఈ రథ చక్రపు ఉదాహరణతో భూమి తిరుగుచున్నదని స్పష్టమగుచున్నది.

భూమి తిరుగుచున్నదనుటకు మరో ఋగ్వేద మంత్రము మరింతగా స్పష్టము చేయుచున్నది. చూడుడు.

**ఓం సవితా యంత్రైః పృథివీమరంణాదస్కంభనే సవితా ద్యా మదృంహత్ ।**

**అశ్వమివా ధుక్షద్ ధునిమంతరిక్షమత్తూరే బద్ధం సవితా సముద్రమ్ ॥**

– ఋ. 10.149.1

**మంత్రార్థము: సవితా =** సూర్యుడు, **యంత్రైః =** పగ్గములలాంటి తన కిరణముల ఆకర్షణతో, **పృథివీం =** భూమిని, **అరంణాత్ =** బంధించుచున్నాడు. మరియు **అస్కంభనే =** ఆకాశంలో నిరాధారమైయున్న, **ద్యాం+అదృంహత్ =** ద్యులోకమున తన చుట్టూ ఉన్న అనేక యితర గ్రహములను కూడా దృఢపరచుచున్నాడు. ఉదాహరణకు **అత్తూరే =** తెగిపోవుటకు వీలులేని ఆకర్షణ రూప పగ్గములతో, **బద్ధమ్ =** బంధింపబడి, **ధునిమ్ =** శబ్దము చేయుచు, **సముద్రమ్ =** తీవ్ర వేగముతో పరిగెత్తగల భూమి, శని, శుక్ర, మంగళ, బుధ మున్నగు గ్రహములను, **అంతరిక్షమ్ =** ఆకాశమునందు (అంతరిక్షమునందు) నిరాధారముగా నున్న యీ గ్రహములను, **అశ్వం+ఇవ =** గుర్రములను పరిగెత్తించునట్లు పరిగెత్తించుచున్నాడు.

అనగా క్రొత్తగా గుర్రములకు శిక్షణ నిచ్చువాడు వాటి పగ్గములను పట్టుకొని వాటిని తన చుట్టూ త్రిప్పుకొనునట్లు సూర్యుడు కూడా గుర్రములలాంటి పృథివ్యాది గ్రహములను తన ఆకర్షణతో తనచుట్టూ త్రిప్పుకొనుచున్నాడు. ఇంతకుమించిన స్పష్టమైన ఉదాహరణ ఇంకేముండగలదు! కావున ఈ పై మంత్రములతో క్రింద విషయములు స్పష్టమగుచున్నవి.

(1) భూమి సూర్యుని చుట్టూ పరిభ్రమించుచున్నది.

(2) సూర్యుని ఆకర్షణతో భూమి తన కక్ష్యను వదిలి అణుమాత్రము కూడా ఇటునటు జరుగజాలదు.

భూమి సూర్యుని చుట్టూ పరిభ్రమించుటకు పట్టు కాలము గురించి ఈ క్రింది మంత్రము స్పష్టము చేయుచున్నది.

**కాలము = సంవత్సరము - ఋతువులు - మాసములు - దినములు**

**ఓం ద్వాదశ ప్రథయశ్చక్రమేకం త్రీణి నభ్యాని క ఉ తచ్చికేత ।**
**తస్మిన్ త్సాకం త్రిశతా న శంకవోఽర్పితాః షష్టిర్నచలాచలాసః ॥**

- ఋ. 1.164.48

**మంత్రార్థము: చక్రం =** సంవత్సరమే చక్రము. రథము యొక్క చక్రము వలెనే సంవత్సరము కూడా మాటిమాటికి తిరుగుచుండును. అట్టి సంవత్సర రూప చక్రమందు, **ద్వాదశ ప్రథమః =** రథ చక్రమున అడ్డనాకుల వలె 12 మాసములున్నవి. **త్రీణి+న భ్యాని =** రథ చక్రపు నాభిస్థానమున నుండు కుండను పోలిన నిర్మాణము వలె వేసవి, వర్షాకాలము, శీతాకాలములు అను మూడు ఋతువులుండును. ఇట్టి విషయమును **కః+ఉ+తత్+చికేత =** ఎవరెరుగుదురు? **తస్మిన్+సాకం+శంకవః =** మూడు ఋతువులతో కూడిన యిట్టి సంవత్సరమున, **త్రిశతా+షష్టిః** = 360 దినములు, **అర్పితాః =** స్థాపించబడియున్నవి. **న+చలాచలాసః =** ఈ దినములు ఎప్పటికీ మార్పు లేనివి–చలింపనివి. దీనితో సంవత్సరమునకు 360 దినములని స్పష్టమగుచున్నది. భూమి సూర్యుని చుట్టూ పరిభ్రమించుట వల్లనే ఈ దినములు ఏర్పడుచున్నవి. భూమి 360 దినములకు ఒకసారి సూర్యుని చుట్టూ తిరుగుచున్నదని కూడా తెలియుచున్నది.

ఈ విషయమందే మరొక మంత్రము:

**ఓం ద్వాదశారం న హి తజ్జరాయ వర్వర్తి చక్రం పరిద్యామృతస్య ।**
**ఆ పుత్రా అగ్నే మిథునాసో అత్ర సప్త శతాని వింశతిశ్చ తస్థుః ॥**

- ఋ. 1.164.11

**మంత్రార్థము: ఋతస్య =** సత్య స్వరూపమైన కాలము యొక్క, **చక్రం =** సంవత్సర రూప చక్రము, **ద్యాంపరి** = ఆకాశమున అన్నివైపుల, **వర్వర్తి =** తిరుగుచున్నది, **ద్వాదశారం =** ఇందులో మాసముల రూపమున 12 అరలున్నవి. **న హి+తత్+జరాయ =** ఈ కాలచక్రము ఎప్పుడూ నశించనిది. **అగ్నే =** ఓ పరమేశ్వరా! నీవు ఎంత అద్భుతమైన వ్యవస్థను (ఏర్పాట్లను) చేసియున్నావు! **అత్ర =** ఈ కాల సంవత్సర రూప చక్రమునందు, **పుత్రాః =** పుత్రులతో సమానమగు, **సప్త+శతాని, వింశతి+చ+ఆతస్థుః =** 720 అహోరాత్రులు (పగలు+రాత్రి) స్థిరమై యున్నవి. ఒక సంవత్సరములో 360 దినములు 360 రాత్రులు కలిసి 720 అహోరాత్రులు - రాత్రింబవళ్ళు అగును. భూమి సూర్యుని చుట్టూ తిరుగుటకు 720 అహోరాత్రముల కాలము పట్టును. సాధారణముగా 365 రోజులలో 'భూమి' సూర్యుని చుట్టూ తిరుగును. కాని యిక్కడ చాంద్రమానము ప్రకారము 360 దినములు చెప్పబడినది. చాంద్రమానములో ఒక నెల అధిక మాసముగా భావించి ఈ లెక్కలను సరిచేయుదురు. ఈ అధిక మాస వర్ణన కూడా వేదములో చెప్పబడినది.

## భూమి గుండ్రముగా నున్నది

సాధారణముగా భూమి సమతలముగాను, బల్లపరుపుగా వున్నట్లు కాననగును. కాని అనేక ప్రమాణముల ద్వారా 'భూమి' బంతివలె గుండ్రముగా నున్నదని ఋజువైనది. కావుననే మన భారతీయ సంస్కృత వాఙ్మయమున భూమిని భూగోళమని పేర్కొనబడినది. భూమిపై నున్న హిమాలయాది పర్వతములు కూడా ఒక యింటిపై చీమలవలె

అతి చిన్నగా అగుపించును. భూమి అతి విశాలమైనదైనందున దాని గోళాకారము మనకు కనబడదు.

(1) అంతరిక్ష యానము ద్వారా పైకెగిరి చాలా దూరము నుండి భూమిని గమనించిన అది గోళాకారముగా – గుండ్రముగా ఉన్నట్లు స్పష్టమగును.

(2) భూమి గోళాకారమును అర్థము చేసుకొనుటకు సముద్రమున పయనించి ఒడ్డును చేరుకొను ఓడలను గమనించిన స్పష్టము కాగలదు. సముద్ర ఉపరితలమును గమనించిన సమతలముగా కనపడును. ఉపరితలము సమతలముగా నున్నచో సముద్రమున పయనించి ఒడ్డుకు చేరుకొను ఓడ మొత్తముగా అనగా క్రింది నుంచి పైవరకు ఒకేసారి కనబడవలెను. కాని అలా కనబడదు. దూరము నుంచి ఒడ్డుకు చేరుకొను ఓడ కొంచెము కొంచెముగా పైభాగము కనబడును. దగ్గరికి వచ్చినకొద్దీ ఓడ పూర్తిగా కనబడసాగును. దీనినిబట్టి భూమి గుండ్రముగా నున్నదని, సముద్ర జలములు భూమిని అంటిపెట్టుకొని ఉన్నందున వాటిపై పయనించు ఓడపై నుంచి కొంచెము కొంచెముగా కనబడును.

(3) మనము భూమిపై ఒక చోటినుండి బయలుదేరి నేరుగా ప్రయాణించినచో మళ్ళీ బయలుదేరిన చోటికే చేరుకోగలము. దీనిని బట్టి కూడా భూమి గుండ్రముగా నున్నదని తెలియవచ్చుచున్నది.

(4) చంద్రుడిపై భూమి నీడ పడుటవల్ల 'చంద్ర గ్రహణము' ఏర్పడుచున్నది. చంద్రునిపై పడు ఆ నీడను గమనించిననూ ఆ నీడ గుండ్రముగానే కనబడును. దీనినిబట్టి కూడా భూమి గుండ్రముగా నున్నదని తెలియును.

ఈ విషయమున వేదాంగములలో నొకటైన జ్యోతిష శాస్త్రపు సిద్ధాంతములు కూడా భూమి గుండ్రముగా నున్నదనియే చెప్పుచున్నవి. జ్యోతిష శాస్త్రము రెండు విధములు (1) ఫలిత జ్యోతిషము (2) గణిత జ్యోతిషము. ఫలిత జ్యోతిషమందు ముహూర్త చింతామణి, బృహజ్జాతకము, లఘు జాతకము లాంటివి కలవు. ఇవి అవైదికము, విజ్ఞాన విరుద్ధములు కావున యివి త్యాజ్యములు. గణిత జ్యోతిషమందు భూమి మొదలు సూర్యుని పర్యంతము గల గ్రహముల గతిని లెక్కించి చెప్పబడును. గణిత జ్యోతిషము వైజ్ఞానికము. స్వీకరణీయము.

మహర్షి పాణిని రచించిన "అష్టాధ్యాయి" సర్వాంగ సుందరమైన, ప్రాచీన వ్యాకరణ శాస్త్రముగా ప్రసిద్ధి చెందినట్లే జ్యోతిష శాస్త్రము కూడా అత్యంత ప్రాచీనమై ప్రసిద్ధి గాంచినది. ఈ శాస్త్రములలో భాస్కరాచార్యుడు రచించిన లీలావతి–బీజగణితము, సిద్ధాంత శిరోమణి మొదలగునవి అతి ప్రసిద్ధములు. "సిద్ధాంత శిరోమణి" అను గ్రంథమును చదువకుండా ఎవరునూ జ్యోతిష శాస్త్రజ్ఞులు కాజాలరు.

భూమి గుండ్రముగా నున్నదనుటలో "సిద్ధాంత శిరోమణి" గ్రంథము నందలి కొన్ని శ్లోకములు.

**యది సమా ముకురోదర సన్నిభా భగవతీ ధరణీ తరణిః క్షితేః ।**

**ఉపరి దూరగతోఽపి పరిభ్రమన్ కిము నరైరమరైరివ నేక్ష్యతే ॥**

**యది నిశాజనకః కనకాచలః కిము తదంతరగః స న దృశ్యతే ।**

**ఉదగయన్నను మేరురథాంశుమాన్ కథముదేతి చ దక్షిణ భాగతకేః ॥**

**అర్థము:** భూమి దర్పణము – అద్దము వలె సమతలముగా నున్నచో సూర్యకాంతి భూమిపై ఎల్లవేళల చూడనగును. కాని అట్లు జరుగుట లేదు. ప్రాతఃకాలము, మధ్యాహ్నము, సాయంత్రము, రాత్రివేళలు భూమిమీద ఏర్పడుచున్నవి. భూమి గుండ్రముగా నుండుటవల్లనే యివి ఏర్పడుచున్నవి. భూమి తిరుగుచుండుట వల్లనే భూమిపై సూర్య కిరణములు పడు భూభాగమున 'పగలు' ఏర్పడును. దాని వ్యతిరేక దిశలో అనగా సూర్య కిరణములు సోకని భూభాగమందు 'రాత్రి' ఏర్పడును. ఈ భూభ్రమణము వలననే అయనములు – ఉత్తరాయణము, దక్షిణాయనము ఏర్పడుచున్నవి.

భూమి గుండ్రముగా నున్న అలా మనకెందుకు కనపడదు అను సందేహమునకు భాస్కరాచార్యుడు తన సిద్ధాంత శిరోమణి గ్రంథములో యిట్లు వివరించినారు.

**సమో యతః స్యాత్ పరిధేః శతాంశః పృథ్వీ చ పృథ్వీనితరాం తనీయాన్ ।**
**నరశ్చ తత్పృష్ఠగతస్య కృత్స్నా సమేవ తస్య ప్రతిభాత్యతః సా ॥**

**అర్థము:** భూమి అత్యంత విస్తీర్ణముగా నుండుట వలన మన కనులకు కనపడు భూభాగము సమతలముగా కాననగును. మానవుడు భూమితో పోల్చినపుడు అత్యంత స్వల్ప ఆకారము కలవాడు. కావుననే అతడి కంటికి కనిపించు భూభాగము సమతలముగా కనపడును.

## భూమికి పైభాగము, క్రింది భాగములున్నవా?

ఎంతటి చిన్న పదార్థమునకైననూ పైభాగము క్రింది భాగములుండుట లోకమున చూడనగును. ఆపిల్ లాంటి ఏ ఫలమునకైననూ, పైభాగము క్రింది భాగముండుటను గమనించవచ్చును. అట్లే భూమిని కూడా పరిగణించవచ్చును. కాని భూమి ఆకృతితో పోల్చినపుడు మానవుడి ఆకృతి నగణ్యము / అత్యంత స్వల్పము. భూమికి ఒక అర్ధగోళమున నున్నవారు మరొక వైపు అర్ధగోళమున నున్నవారిని తమక్రింద వున్నట్లు భావింతురు. కాని వారిద్దరూ సమాంతర అర్ధగోళము లందే వుందురు. ఒకరు క్రింద ఒకరు పైన అను వ్యవహారము సరికాదు. ఉదాహరణకు అమెరికా దేశము భూమికి ఒక అర్ధగోళమున నున్నది. యూరప్ మరియు ఆసియా ఖండ దేశములు మరొకవైపు అర్ధగోళముగా నున్నవి. ఈ రెండు సమాంతరముగా నున్ననూ ఒకటి పైన మరొకటి క్రింద వున్నట్లు వ్యవహరింతురు.

ఈ విషయమున జ్యోతిష శాస్త్రజ్ఞుడైన భాస్కరాచార్యుడి అభిప్రాయము –

**యో యత్ర తిష్టత్యవనీం తలస్థమాత్మానమస్యా ఉపరిస్థితం చ ।**
**స మన్యతేఽతః కు చతుర్థసంస్థా మిథశ్చ తే తిర్యంగివామనంతి ॥**

**అర్థము:** భూమిపై ఎవరు ఎక్కడ వున్ననూ తమను తాము భూమిపై భాగమున నున్నట్లు మరో భాగమున నున్నవారిని క్రింది భాగమున నున్నట్లు భావింతురు.

## భూమికి ఆధారముగా నేమున్నది?

నేడు భూమి తిరుగుతున్నదనుట స్పష్టమయినది. మత గ్రంథాలలో ఈ విషయం అత్యంత అవైజ్ఞానికరీతిలో ప్రస్తావించబడినది. మత గ్రంథకారులు ఈ భూమి విషయమునగాని, సూర్య చంద్ర నక్షత్రములపై గాని ఒకింత బుద్ధి సారించి పరిశీలించినట్లు కనబడదు. వీరు భూమి ఎలాంటి ఆధారము లేకుండా ఎలా ఉండగలదనుకున్నారే గాని. భూమికి ఎన్నో రెట్లు పెద్దది, గొప్పది అయిన సూర్యుడు ఏ ఆధారము లేకుండా తిరుగుతున్న సంగతి వీరి బుద్ధికి తట్టలేదు. కోట్లకొలది నక్షత్రములను ఎవరు పట్టుకొని ఉన్నారు? మన తలలపై పడకుండా ఎలా ఉన్నవి? అను ప్రశ్నలకు ఈ మత సంప్రదాయవాదులు మంచి కథలే అల్లినారు. బుద్ధిహీనులయిన తమ తమ శిష్యులకు సూర్యుడు సాక్షాత్తు భగవంతుడే. అతడు చైతన్యము గల దేవుడు. కావున అతడు (సూర్యుడు) రథము నెక్కి భూమి చుట్టూ పరిక్రమ చేయుచున్నాడని చెప్పుదురు.

పుణ్య పురుషులు మరణించిన తరువాత సూర్యలోకమును చేరి అట నివాసముందురనియు చెప్పుదురు. అట్లే చంద్రుడు మొదలగు గ్రహోపగ్రహములను కూడా దేవతలనియే చెప్పుదురు. పితరులు ఈ సూర్య చంద్రాది లోకములలో అమృతపానము చేయుచు ఆనందమునననుభవింతురను గప్పాలు శిష్యులకు మరియు తమ అనుయాయులకు ఉపదేశించుచుందురు.

అంధానుయాయులయిన పౌరాణికులను వారి శిష్యులు ఏ ఆధారము లేకుండా, ఏ రహదారి లేకుండా సూర్యుడు రథముపై ఏ మార్గమున ప్రయాణించునని ప్రశ్నించరు కదా! ఒకవేళ అడిగినను వీరు ఏదో ఒక కల్పిత కథను సమాధానముగా చెప్పగలరు. వారందరు దేవతలు వారు స్వయముగా తిరుగగలరు. ఏమైనా చేయగల సమర్థులని చెప్పుదురు. భూమిని మాత్రమే అది దేవత కాదు, చేతనము కూడా కాదందురు. భూమిని కూడా సూర్యాదుల వలెనే చేతన దేవతగా భావించిన దానికి ఆధారము అంగీకరింపకయే వ్యవహారము జరిగిపోయెడిది.

ఎవడి ఆజ్ఞతో సూర్య చంద్రాదులు తమకు నిర్దేశించిన కక్ష్యలో క్రమము తప్పకుండా తిరుగుచున్నవి? నిర్దేశిత సమయానికే ఉదయిస్తూ అస్తమిస్తున్నవి? అని బుద్ధితో ఆలోచించిన ఇలాంటి వ్యర్థపు ప్రేలాపనలకు తావుండదు కదా! కాని ఈ మత సాంప్రదాయవాదులు తమ అనుయాయులకు తమ మాటల గారడితో భూమికి ఆధారమును కల్పించి చెప్పుదురు. కొందరు భూమి 'శేషనాగు' తలపై వున్నదని, మరికొందరు కూర్మము-తాబేలు వీపుపై వున్నదని, ఇంకొదరు నౌక వలె జలముపై తేలియాడుచున్నదను ఎన్నో కల్పిత కథలను తమ శిష్యులకు ఉపదేశింతురు. ఇలాంటి కల్పిత కథలను ఉపదేశించువారికి భూమిని గురించి ఎలాంటి సత్య జ్ఞానము లేదనియే చెప్పవచ్చును.

భూమి శేషనాగుపై వున్నదనిన ఆ శేషనాగు దేనిపై నున్నది? అని ప్రశ్నించిన నేమి సమాధానము చెప్పుదురు?

భూమి స్థిరముగా వుండి దానిచుట్టూ సూర్యుడు తిరుగుచున్నాడను భాస్కరాచార్యుడి సిద్ధాంతము కూడా వేద విరుద్ధమే. భూమియే సూర్యుడి చుట్టూ తిరుగుచున్నది ఏలయన సూర్యుడు భూమికంటే 13 లక్షల రెట్లు పెద్దది. సూర్యుడితో పోల్చినపుడు భూమి చాలా చాలా చిన్నది. పెద్దదైన సూర్యుడు తనకంటే చాలా చిన్నదియైన భూమిచుట్టు తిరుగుట సాధ్యము కాదు కదా! భూమికి ఆధారము ఏమిటను విషయమున భాస్కరాచార్యుడి అభిప్రాయము.

**మూర్తో ధర్తా చేద్ధరిత్ర్యాస్తదన్యస్యాప్యన్యోప్యేవమత్రానవస్థా ।**
**అంతే కల్ప్యాచేత్ స్వశక్తిః కిమాద్యే కిన్నో భూమిః సాష్టమూర్తేశ్చమూర్తిః ॥**

**అర్థము:** భూమికి ఆధారము శరీరధారులను (శేషనాగు, కూర్మము మొ॥) అంగీకరించిన వాటి శరీరములకు మరొక ఆధారమును అంగీకరించవలసి వచ్చును. అట్లంగీకరించిన వారికినీ మరొక ఆధారమును అంగీకరిస్తూపోతే అందుకు అంతముండదు. చివరకు అన్నింటినీ ధరించు శక్తిని అంగీకరింపక తప్పదు. కావున భూమికి ఆధారము భగవత్ ప్రేరితమైన తన (భూమి) శక్తియేనని అంగీకరించిన సమస్య వుండదు.

ఈ విషయమున మరొక శ్లోకము...

**యథోష్ణ తార్కానలయోశ్చ శీతతా విధౌ ద్రుతిః కే కఠినత్వమశ్మని ।**
**మరుచ్చలో భూరచలా స్వ భావతో యతో విచిత్రాః ఖలు వస్తు శక్తయః ॥**

**అర్థము:** స్వాభావికముగనే సూర్యుడు, అగ్ని మొ॥ వాటిలో ఉష్ణత, చంద్రుడిలో వెన్నెల జలములో శీతలత, శిలలలో కాఠిన్యము, వాయువులో చలనశక్తి వున్నట్లే భూమికి కూడా స్థిరత్వము స్వాభావికము. భూమి కూడా తన స్వాభావికశక్తితోనే స్థిరముగా ఉన్నదనుటలో ఆశ్చర్యమేమున్నది?

**సమీక్ష:** భాస్కరాచార్యుడు గొప్ప జ్యోతిశ్శాస్త్ర పండితుడైయుండి భూమి స్థిరముగా నున్నదని చెప్పి పొరబడిరనుటలో సందేహము లేదు. అంతేకాకుండా సూర్యుడు, చంద్రుడు, మంగళ, బుధ, బృహస్పతి, శుక్రుడు, శని మొదలగు గ్రహములు, మరియు నక్షత్ర మండలమంతయు భూమిచుట్టు తిరుగుచున్నవని, భూమండలము మాత్రమ తన శక్తితో స్థిరముగా నున్నదని అభిప్రాయపడ్డారు.

అదెట్లన.....

**“భూమేః పిండః శశాంకజకవిరవికుజేజ్యార్కి నక్షత్ర కక్షావృత్తైః వృత్తోఽ వృతః సన్ మృదనిల సలిలవ్యోమ తేజోమయోఽయమ్ । నాన్యాధారః స్వశక్త్యా వియతి చ నియతం తిష్ఠతీహాస్య పృష్ఠే నిష్ఠం విశ్వం చ శశ్వత్ సదను జమనుజాదిత్య దైత్యం సమంతాత్ ॥”**

దీనినిబట్టి భాస్కరాచార్యుడి దృష్టి వేదవిజ్ఞానము వైపు వెళ్ళలేదనే భావించాలి. ఎందుకనగా సూర్యుడు, చంద్రుడు మొదలగునవి తిరుగుచున్నవనీ భూమి మాత్రము తిరుగకుండా స్థిరముగా నున్నదని భావించారు. సూర్యచంద్రుల ఉదయాస్తమయాలను చూచి అవి చలించుచున్నవని భావించారే కాని భూమి తిరుగుటను గమనించరైరి. రైలులోని చీమకు రైలుబండి గమనము తెలియనట్లే వీరికిని భూమి తిరుగుట తెలియకయే అది స్థిరమనిరి. ఈ ఆచార్యులు తీవ్రబుద్ధితో వేదాది శాస్త్రములను లోతుగా అధ్యయనము చేయకపోవడం వల్లనే యిలాంటి పొరపాట్లు దొర్లియుండుననుటలో సందేహము లేదు.

## వేదములలో భూమికి గల పేర్లు

వైదిక కోశము నిఘంటువు నందు భూమికి 21 పేర్లు లెక్కించబడినవి.

**“గో, గ్మా, జ్మా, క్మ, క్షా, క్షమా, క్షోణి, క్షిత, అవని, ఉర్వీ, పృథివీ, మహీ, రిపః, అదితి, ఇళా, నిఋుతి, భూ, భూమిః, పూషా, గాతుః, గోత్రా, ఇతి ఏకవింశతిః పృథివీ నామ ధేయాని. (నిఘంటువు 1.1)**

ఈ పై పేర్లలో భూమిని స్థిరమని సూచించు పదములు లేవనే చెప్పాలి. కొందరు ఆచార్యులు భూమిని స్థిరమని భావించడంవల్ల ఆధునిక సంస్కృత కోశమైన ‘అమర కోశము’లో **“భూర్భూమి రచలాఽనంతా రసా విశ్వంభరా స్థిరా”** అని భూమికి స్థిరత్వాన్ని ఆపాదించు శబ్దములను జోడించడమైనది.

ప్రాచీన వైదిక కాలములో భూమిని స్థిరమని భావించెడివారు కాదు. తరువాతి కాలంలోనే భూమి స్థిరమను వాడుక వచ్చింది.

వైదిక కాలములో భూమిని స్థిరముగా నుండునదిగా భావించి యుండినా అలాంటి పద ప్రయోగములు తప్పక ఉండి వుండేవి. కాని తద్విరుద్ధముగా భూమికి ‘గో’ శబ్దము ప్రయోగించబడినది. ‘గో’ అంటేనే గతి గలది అని అర్థము. **“గచ్ఛతి ఇతిగౌః”**. ప్రాచీన ఋషులు భూమిని గమనం కలది / తిరుగునది అని భావించినందువల్లనే దానిని ‘గో’ శబ్దముతో పిలిచారు. కాలాంతరమున ఆచార్యులలో విజ్ఞాన జిజ్ఞాస లోపించడమువల్ల ‘గో’ శబ్దమునకు అనేక రకాల వ్యుత్పత్తులను (శబ్దసిద్ధిని) చెప్పడం ప్రారంభించి...

**“గచ్ఛంతి ప్రాణినో అస్యాం ఇతిగౌః”, “యాం గాయంతి జనాః సా గౌః”** ప్రాణులు దేనియందు చరింతురో అది గౌః – భూమియని, ప్రజలు దేనియందు పాడుదురో అది గౌః – భూమియని, విపరీతార్థములు చెప్పదొడిగిరి. ఇందు వైదిక శబ్దకోశమైన నిఘంటువుది తప్పు కాదు. విజ్ఞాన లోపమే దానికి కారణమనదగును.

## వేదాలలో భూమ్యాకర్షణశక్తి : EARTH MAGNATISM

భూమ్యాకర్షణ శక్తిని గురించిన జ్ఞానము ఆధునిక విజ్ఞానమని దానిని “సర్ ఐసక్ న్యూటన్” అను ఐరోపా శాస్త్రవేత్త మొదట కనుగొన్నాడని చెప్పుదురు. మనమంతా అదేవిధంగా పాఠ్య పుస్తకాలలో చదువుతున్నాము కూడా. కాని యిది వాస్తవము కాదు. భారతదేశంలో భూమ్యాకర్షణ గురించిన చర్చలు ప్రాచీన కాలము నుండే జరుగుచున్నవి. ప్రముఖ జ్యోతిషాచార్యుడు (ఖగోళ శాస్త్రవేత్త) తన సిద్ధాంత శిరోమణి గ్రంథమున ఒక ప్రాచీన శ్లోకమునుట్టంకించియున్నాడు. గమనించండి.

**ఆకృష్టశక్తిశ్చ మహీ తయా యత్ ఖస్థం గురు స్వాభిముఖీకరోతి ।**

**ఆకృష్యతే తత్పతతీవ భాతి సమే సమంతాన్ కురియంప్రతీతిః ॥**

**అర్థము:** ఆకర్షణ శక్తి పదార్థాలన్నింటిలోనూ విద్యమానమై యున్నది. భూమి తన ఆకర్షణశక్తి వల్లనే పైకి విసిరిన వస్తువులను తనవైపుకు లాగుతున్నది. దానినే వ్యవహారమున క్రిందపడుచున్నదని భావింతుము. దీనినిబట్టి భాస్కరాచార్యుని కంటే చాలా మునుపే ఈ విజ్ఞానము భారత దేశమున నున్నదని స్పష్టమగుచున్నది. “ఆర్య భట్టీయం” అను జ్యోతిశ్శాస్త్రమందును దీని వర్ణణ చూడనగును.

ఈ విషయమున వేద మంత్ర ప్రమాణములను పరిశీలింతము.

**ఓం ఆకృష్ణేన రజసా వర్తమానో నివేశయన్న మృతం మర్త్యం చ ।**
**హిరణ్యయేన సవితా రథేన దేవోయంతి భువనాని పశ్యన్ ॥**

– ఋ. 1.35.2

**అర్థము: కృష్ణేన** = ఆకర్షణశక్తితో కూడిన, **రజసా** = పృథివ్యాది లోకములు (లోకాః రజాంసి ఉచ్యతే – నిరుక్తము). రజ మనగా లోకమని అర్థము. **హిరణ్యయేన** = తనవైపునకు ఆకర్షించు–లాగు స్వభావము కలిగిన, **రథేన** = రథముతో / శరీరముతో – సూర్యుడు తన చుట్టూ తిరుగు పదార్థములను తనవైపు ఆకర్షించును–లాగును. అనగా **సవితా** = సూర్యుడు, **కృష్ణేన రజసా** = ఆకర్షణశక్తి యుక్తమైన పృథివ్యాది లోకములతో, **వర్థమానః** = ఉంటూ, **అమృతం + మృతంచ** = అమృతరూపమైన పృథివ్యాది లోకములు మరియు ఆ లోకములందు జీవించు శరీరధారులైన జీవులు మొదలగు వాటిని, **ఆనివేశయన్** = తమ తమ కార్యములలో లగ్నము చేయుచు, **దేవః** = ఆ గొప్పదైన సూర్యుడు, **హిరణ్యయేన + రథేన** = తనవైపు ఆకర్షించు స్వభావము గల రథము ద్వారా, **భువనాని పశ్యన్** = తనచుట్టూ వున్న లోకములను పరిశీలించుచున్నాడా యన్నట్లు, **ఆయాతి** = నిరంతరము వచ్చిపోవుచుండును.

పై మంత్రములోని కృష్ణ శబ్దము ద్వారా పదార్థములన్నీ ఆకర్షణశక్తితో కూడినవని తెలియుచున్నది. భూమి తనవైపునకు, సూర్యుడు కూడా తనవైపుకు పరస్పరము ఆకర్షించుకొనుచున్నవని స్పష్టమగుచున్నది. కావుననే భూమి సూర్యునిపై పడి నశించుటలేదు. సూర్యుడు భూమికంటే 13 లక్షల రెట్లు పెద్దది. ఈ సౌర మండలమునకు అధిపతి కూడా సూర్యుడే. ఈ గ్రహోపగ్రహములు పరస్పర ఆకర్షణ శక్తి వల్లనే నశించకుండా తిరుగుచున్నాయనుటలో సందేహము లేదు. వేదములలో సూర్యుణ్ణి కృష్ణ నామముతో చెప్పబడినది. సూర్యుడు పృథివ్యాది లోకములను ఆకర్షణ శక్తితో తనవైపు లాగివుంచుట వల్లనే అవి స్థిరముగా తమ తమ కక్ష్యలలో తిరుగుచున్నవి.

## వేదములో జలచక్ర వర్ణన : HYDROLOGICAL CYCLE - WATER CYCLE

**ఓం కృష్ణం నియానం హరయః సుపర్ణా అపో వసానా దివ ముత్పంతి ।**
**త ఆవవృత్రత్స్ను దనాదృతస్యాదిద్ ఘృతేన పృథివీ వ్యుద్యతే ॥**

– ఋ. 1.164.47

**అర్థము: హరయః + సుపర్ణా** = ఆకర్షించు లక్షణము గల సూర్య కిరణములు, **నియానం కృష్ణం** = నియమబద్ధమైన, ఆకర్షణ శక్తిగల సూర్యుని వైపు, **అపః వసానా** = జలములను తోడుగా తీసుకొని, **దివం + ఉత్పతంతి** = ఆకాశం వైపు లేచిపోవును. అనగా సూర్యుని నుండి వెలువడిన కిరణములు భూమిపైకి వచ్చి, భూమిపై గల జలములను తీసుకొని సూర్యుని వైపుకు పోవునట్లుండును. (ఇదొక అలంకారిక వర్ణన). **తే** = ఆ సూర్య కిరణములు, **ఋతస్య + సదనాత్** = సూర్య సదనముల నుండి, **ఆ + ఆవవృత్రన్** = రాకపోకలు జరుపుచునే యుండును, **ఆత్ + ఇత్** = అప్పుడే, **ఘృతేన + పృథివీ + వి ఉద్యతే** = జలములతో భూమి తడుపబడును అనగా

వర్షములు కురియుట జరుగును.

కృష్ణ శబ్దమునకు వేరు వేరు భాష్యకారులు వేరు వేరు అర్థములను చెప్పినప్పటికి ఇక్కడ ప్రకరణానుసారము ఇచ్చట సూర్యుడని చెప్పుటయే ఉచితము. వి + చర్షతిః కృష్ ధాతువు నుండే 'చర్షణి' శబ్దము వ్యుత్పన్నమగును. కృష్ ధాతువునకు 'ఆకర్షణ' యనియే అర్థము. ఈ ధాతువు వల్లనే ఆకర్షణ, ఆకృష్టి, కృష్ణ మొదలగు శబ్దములు సిద్ధించుచున్నవి. క్రింది మంత్రము ద్వారా యిది మరింత స్పష్టమగును.

## వేదములలో సూర్యాకర్షణశక్తి

**ఓం హిరణ్యపాణిః సవితా విచర్షణిరుభే ద్యావా పృథివీ అంతరీయతే ।**
**అపామీవాం బాధతే వేతి సూర్యమభి కృష్ణేన రజసాద్యామృణోతి ॥**

– ఋ. 1.35.9

**అర్థము: హిరణ్య పాణిః** = దేని యొక్క కిరణములు ఆకర్షణ శక్తితో కూడియున్నవో, **విచర్షణిః** = అత్యంత ఆకర్షణ శక్తితో కూడిన, **సవితా** = సూర్యుడు, **ఉభే + ద్యావా-పృథివీ** = ద్యులోకము, పృథివీ లోకములను రెండింటినీ తమ తమ స్థానములలో వుంచునో అనగా పరస్పరము ఢీకొట్టుకొనకుండా చేయునో, **ఆమీవాం + అప - బాధతే** = అట్టి సూర్యుడు తనచుట్టు తిరుగు గ్రహోపగ్రహములకు ఎలాంటి ఉపద్రవము లేర్పడకుండా చేయుచూ, **సూర్యం + వేతి** = తన కక్ష్యలో తిరుగుచున్నది. (ఇక్కడ 'సూర్యం' ప్రథమా విభక్తి అర్థములో ద్వితీయ విభక్తి ప్రయోగించబడినది), **కృష్ణేన + రజసా** = ఆకర్షణ శక్తితో కూడిన ఆ సూర్యుడు అత్యంత వేగముతో, **ద్యాం + అభి + ఋణోతి** = ద్యులోకమందు నలువైపులా అంతటా వ్యాపించుచున్నాడు.

ఈ విషయమందే మరొక మంత్రము:

**ఓం పంచారే చక్రే పరివర్తమానే తస్మిన్నా తస్థు ర్భువనాని విశ్వా ।**
**తస్య నాక్షస్తప్యతే భూరి భారః సనాదేవ న శీర్యతే సనాభిః ॥**

– ఋ. 1.164.13

**అర్థము: విశ్వా + భువనాని** = సూర్యుని చుట్టూ ఉన్న పృథివ్యాది సర్వ లోకములు గ్రహోపగ్రహములు, **తస్మిన్ + చక్రే** = ఆ సౌర కుటుంబ చక్రమును ఆధారము చేసుకొని, **ఆ + తస్థుః** = బాగుగా నున్నవి, **పంచారే** = ఆ చక్రమునందు ఋతువుల రూపమున అయిదు అరలున్నవి. **పరివర్తమానే** = ఆ చక్రము స్వయముగా తిరుగుచున్నది. **తస్య** = ఆ చక్రము యొక్క, **భూరి భారః** = చాలా బరువైన, **అక్షః** = మధ్యలో నుండు నాభిస్థానము, **న తప్యతే** = దెబ్బతినదు. **సనాత్ + ఏవ + న + శీర్యతే** = సనాతనమైనది – ఎప్పుడూ విరిగిపోనిది. శాశ్వతమైనది. **సనాభిః** = ఆ చక్రము బంధనాశక్తితో కూడుకొన్నది.

పై ఋగ్వేద మంత్రము వల్ల ఈ క్రింది విషయములు స్పష్టమగుచున్నవి.

**1)** **భువనాని విశ్వా** = సంపూర్ణ విశ్వము సూర్యరూప రథముపై నున్నదనుటలో భూమి మొదలగు గ్రహోపగ్రహములకంటే సౌరచక్రము పెద్దదని స్పష్టమగుచున్నది.

**2)** **భూరిభారః** = సౌర చక్రము తన ఆకర్షణ శక్తి వల్ల గొప్పదిగా వర్ణింపబడినది. ఇంతటి భారము వహిస్తున్నప్పటికీ దాని అక్షమునకు ఎలాంటి క్షతి-నష్టము జరుగదు-విరగదు. అది సనాతనమైనది కావున.

**3)** **సనాభిః** = 'ణహ' బంధనే అను ధాతువుతో 'నాభి' శబ్దమేర్పడినది. మానవ శరీరమును 'నాభి' కలిపి వుంచునట్లే ఈ సూర్య చక్రము కూడా నాభి వలె పృథివ్యాది లోకలోకాంతరములను కలిపి ఉంచుతుంది. కావుననే అది "సనాభిః"

పదముతో చెప్పబడింది.

సూర్యుడు చేతన దేవతనా? ప్రాచీన ఋషి మునులు అలాగే భావించారా? సూర్యుడు పృథివ్యాది లోక లోకాంతరములను తన చేతులతో / పగ్గములతో పట్టి బంధించియున్నాడా? అను సందేహము కలుగవచ్చును. ఇలాంటి సందేహము పూర్తిగా నిరాధారము. ఇది ప్రాచీన ఋషి మునులను అవమానించడమే. సూర్యాది లోకములను ఋషిమునులెన్నడూ చేతన దేవతలుగా భావించలేదు. వేదములందు కూడా పృథివ్యాదుల వలెనే సూర్యుడు కూడా జడ పదార్థమనియే వర్ణించబడియున్నది. సూర్యుడు తన ఆకర్షణ శక్తి వల్లనే తనచుట్టూ తిరుగు గ్రహోపగ్రహాలను వాటి వాటి నిర్దేశిత దూరాలలో బంధించి యుంచినట్లు తెలియనగును.

ఈ విషయమును క్రింది ఋగ్వేద మంత్రం మరింత స్పష్టము చేయుచున్నది.

**ఓం ఇరావతీ ధేనుమతీ హి భూతం సూయవసినీ మనుషే దశస్యా ।**
**వ్యస్తంభ్నా రోదసీ విష్ణవేతే దాధర్థ పృథివీమభితోమయూఖైః ॥**

– ఋ. 7.99.3

**అర్థము:** ఓ ద్యులోక పృథివీ లోకములారా! మీరు, **మనుషే** = జీవులకు (మనసు కలిగినవారలకు) **దశస్యా** = ఎల్లప్పుడు దానము నిచ్చు స్వభావము గలవారు (దానశీలురు) **ఇరావతీ** = ఐశ్వర్యము గలవారు, **ధేనుమతి** = గోసంపద కలిగినట్టివారు, **సూయవసినీ** = ధన ధాన్యములతో సుశోభితులు, **భూతం** = అగుదురు గాక! అని వర్ణించి సూర్యుడికి పృథివ్యాదులకు గల సంబంధము తెలుపబడింది. **విష్ణోః** = ఓ సూర్యదేవ! నీవు, **ఏతే + రోదసీ** = ద్యులోక పృథివీ లోకములను, **వ్యస్తభ్నాః** = పలువైపుల నుండి పట్టి ఉంచినావు, **పృథివీం** = భూమిని, **అభితః** = నలువైపుల నుండి, **మయూఖైః** = కిరణముల ద్వారా, **దాదర్థ** = పట్టి ఉంచినావు. **రోదసీ** = ద్యులోక పృథివీ లోకములను, **వ్యస్తభ్నాః = వి + అస్తభ్నాః** = అన్నివైపుల నుండి పట్టి ఉంచుచున్నావు.

ఈ మంత్రంలో ఈ క్రింది అనేక విషయములు స్పష్టమగుచున్నవి.

**1) రోదసీ** శబ్దముతో పృథివీ ద్యులోకములు కూడా ఆకర్షణ శక్తి కలిగియుండి తమ వైపునకు ఆకర్షించుచున్నవని తెలియుచున్నది.

**2) విష్ణుః** = ఇది సూర్యునికి పేరు. ద్యులోక పృథివీ లోకములను సూర్యుడు తన ఆకర్షణ శక్తితో పట్టి ఉంచినాడనుటలో సూర్యుడు పెద్దదని, తన చుట్టు తిరుగు గ్రహోపగ్రహములు చిన్నవని స్పష్టమగుచున్నది. కావున సూర్యుడే భూమిచుట్టూ తిరుగుచున్నాడనుట అజ్ఞానమే యగును. ఒక మహా పర్వతము ఆవగింజ చుట్టూ తిరగదు కదా!

**3) మయూఖైః** = సూర్యుడు తన కిరణములతో భూమిని ధరించుచున్నాడు / పట్టి ఉంచుచున్నాడు అనుటలోని భావము. నిఃసందేహముగా సూర్యుడు తన ఆకర్షణ శక్తితోనే పృథివ్యాది లోకములను పట్టి ఉంచి ధరించుచున్నాడనియే.

ఈ విషయమందే మరొక మంత్రము:

**ఓం అనడ్వాన్ దాధార పృథివీముత ద్యా మనడ్వాన్ దాధారోర్వంతరిక్షమ్ ।**
**అనడ్వాన్ దధార ప్రదిశః షడుర్వీరనడ్వాన్ విశ్వం భువనమావివేశ ॥**

– అథర్వ. 4.11.1

**అర్థము: అనడ్వాన్** = సూర్యుడు, **పృథివీం + దాధార** = భూమిని పట్టి ఉంచినాడు. **అనడ్వాన్ + ఉత + ద్యాం + ఉరు అంతరిక్షమ్** = సూర్యుడు ద్యులోకమును విస్తారమైన అంతరిక్షమును, **దాధార** = పట్టి ఉంచినాడు.

**అనడ్వాన్ + ప్రదిశః + దాధార =** సూర్యుడు దిక్కు లన్నింటినీ పట్టి ఉంచినాడు. **అనడ్వాన్ + షడ్ + ఉర్వీ =** సూర్యుడు వివిధములైన పృథివ్యాది ఆరు లోకములను పట్టి ఉంచినాడు. **విశ్వం + భువనం + ఆవివేశ =** ఈ సూర్యుని ఆకర్షణశక్తి అన్నివైపులలో నిండి ఉన్నది.

పై అథర్వ వేద మంత్రములో అనేక విషయములు విస్పష్టముగా నిరూపితమగుచున్నవి.

పృథివీ ద్యులోకములను ధరించియుంచునది సూర్యుడేననియూ, **షడుర్వీ** = భూమి మొదలుగా గల మంగళ, బుధ, గురు, శుక్ర, శని మొదలగు ఆరు గ్రహములను సూర్యుడే తన ఆకర్షణ శక్తితో ధరించుచున్నాడని స్పష్టమగుచున్నది. **అనడ్వాన్** = అనడ్వాన్ అంటే ఎద్దు అని కదా అర్థము. దీనివల్ల పౌరాణికుల సిద్ధాంతం వృషభము (ఎద్దు) తన కొమ్ములపై భూమిని ఎత్తి మోయుచున్నదను సిద్ధాంతమే సిద్ధమగుచున్నదనిన అది సరికాదు. వేదజ్ఞాన లోపమే దీనికి కారణము. దీని తరువాత మంత్రము (4.11.2)లో **అనడ్వానింద్రః =** అనడ్వాన్ అనగా ఇంద్రుడు – సూర్యుడు అని చెప్పబడినది. కావున అనడ్వాన్ పదమును సూర్య వాచకముగానే గ్రహింపవలెను. ఇందుకు మరొక ప్రమాణము.

**ఓం సహస్ర శృంగో వృషభో యః సముద్రాదుదాచరత్ ।**
**తేనాం సహస్యేనా వయం ని జనాన్ స్వాపయామసి ॥**

– అథర్వ. 4.5.1

**భావము:** వేయి కొమ్ములు గల వృషభము సముద్రము నుండి పైకి వచ్చుచున్నది. ఈ మంత్రమందు వేయి కొమ్ములు గల వృషభము నిశ్చయముగా సూర్యుడే. సూర్యుడి కిరణములే వేయి కొమ్ములు. ఇచ్చట సముద్ర శబ్దము ఆకాశమును సూచించును. నిఘంటు, నిరుక్తములలో దీనిని చూడవచ్చును.

## వేదాలలో చంద్రుడు

మత సాంప్రదాయ గ్రంథాలలో చంద్రుడి విషయమున అనేక అభూత కల్పనలు చోటు చేసుకొన్నాయి. అందులో కొన్ని...

1) చంద్రుడు అమృతమయుడు. దేవతలు, పితృగణములు ఆ అమృతమును త్రాగుచుందురు. అందువలననే చంద్రుడు తగ్గుతూ, పెరుగుతూ ఉంటాడు. పురాణాలలో యిలాంటి గప్పాలు ఎన్నో వున్నా మహాకవి కాళిదాసు కూడా ఇలాంటి వర్ణననే చేసియున్నాడు. చూడండి... "పర్యాయపీతస్య సురైః హిమాంశోః కళాక్షయః శ్లాఘ్యతరోహివృద్ధేః ॥"

2) చంద్రుడి ఒడిలో ఒక కుందేలు పిల్ల కూర్చొని యున్నది. కావుననే చంద్రుడిలో దాని గుర్తు కనబడును. అందుకే చంద్రుడిని శశాంకుడను పేరుతో పిలిచెదరు.

3) చంద్రుడు అత్రి ఋషి కన్నుతో పుట్టిందని, మరికొందరు సముద్రము నుండి పుట్టినది చెప్పుదురు.

4) పురాణాలలో దక్ష పుత్రికలైన అశ్వినీ, భరణీ మొదలగు 27 కన్యలతో చంద్రుడికి వివాహమైనదని, వారి పేర్లతోనే 27 నక్షత్రములున్నవని వ్రాయబడినది.

5) చంద్రుడు సూర్యునికంటే పైన వున్నాడని కొందరందురు.

6) చంద్రుడి వల్లనే చంద్ర వంశము ప్రారంభమైనదని కొందరి వాదన.

7) చంద్రుడిని రాహువు మ్రింగటంవల్ల చంద్ర గ్రహణము ఏర్పడునను ఎన్నో గప్పాలు / కల్పిత కథలు చంద్రుడి విషయమున ప్రచారములో నున్నవి.

చంద్రుడి విషయమున వేదాభిప్రాయమేమిటో తెలుసుకొందము.

**చంద్రుడిలో ప్రకాశమెక్కడిది?**

**అథాऽప్య స్యైకో రశ్మిశ్చంద్ర మసంప్రతి దీప్యతే తదేతేనోపేక్షితవ్యమాదిత్యతోऽస్య దీప్తి ర్భవతి.**

(నిరుక్తము. 2.7)

నిరుక్తకారుడైన యాస్కాచార్యుడు తన గ్రంథములో చంద్రుడి గురించి వ్రాస్తూ – సూర్యుడి కిరణములు ఎల్లపుడు చంద్రుడిపై పడుచుండును. కావుననే చంద్రుడిలో నుండు ప్రకాశము ఆ సూర్య కిరణముల వల్లనేనని అంటాడు. వాస్తవముగా భూమివలెనే చంద్రుడు కూడా ప్రకాశ రహితమే. సూర్య కిరణములు భూమిపై పడిన భాగములో పగలు అగునట్లే, సూర్య కిరణములు చంద్రుడిపై పడటం వల్ల అది ప్రకాశవంతమగును. సూర్య కిరణములు చంద్రుడిపై పడకుండిన అది ఎల్లప్పుడు మసక మసకగానే కనబడుచుండెడిది. ఇలాంటి లోతైన వైజ్ఞానిక విషయాలు వేదాలలో పలుచోట్ల పలురకాలుగా వర్ణింపబడియున్నాయి. యాస్కాచార్యుడు కూడా ఈ వేదాభిప్రాయాన్నే తన వాక్కులలో ప్రకటించాడు.

ఈ విషయమున వేదమంత్ర ప్రమాణములను పరిశీలిద్దాము...

ఓం **అత్రాహ గోరమన్వత నామ త్వష్టురపీచ్యమ్ ।**

**ఇత్థా చంద్రమసోగృహే ॥** – ఋ. 1.84.15

**అర్థము:** గోః = గమనశీలమైన, చంద్రమసః = చంద్రుడి యొక్క, అత్ర + హ + గృహే = ఈ గృహమునందే, త్వష్టుః = సూర్యుడి యొక్క, నామ = సుప్రసిద్ధమైన జ్యోతి ప్రకాశము, ఇత్థా = ఈ విధముగా, అపీచ్యమ్ = అంతర్భూతమై దాగియున్నది. ఈ వేద మంత్రము సందేహములన్నింటినీ పటాపంచలు చేయుచున్నది.

చంద్రుడి గృహమందే సూర్యుడి ప్రకాశము దాగియున్నదనుటలోనే సూర్యుడి ప్రకాశము వల్లనే చంద్రుడు ప్రకాశించుచున్నాడని స్పష్టమగుచున్నది.

దీనినే వేద భగవానుడు మరో విధముగా వివరించుచున్నాడు.

ఓం **సోమో వధూయురభవదశ్వినాస్తాముభా వరా ।**

**సూర్యాం యత్పత్యే శంసంతీం మనసా సవితాऽదదాత్ ॥**

– ఋ. 10.85.6

**అర్థము:** సూర్యుడి కన్యతో / కూతురితో చంద్రుడికి వివాహము. ఇది ఈ మంత్రములోని అలంకారిక వర్ణన. సూర్యుడి ప్రకాశమే అతడి కూతురు. అపుడు మంత్రార్థము – **సోమః =** చంద్రుడు, **వధూయుః =** వధువును పొందు కోరిక గల వాడైనందున, **ఉభౌ + అశ్వినౌ + వరౌ + ఆస్తాం =** అహోరాత్రులు (అశ్వినులు) పెళ్ళి ఊరేగింపులో పాల్గొనువారైరి. **యద్ =** ఎప్పుడు, **మనసా =** అత్యంత ప్రేమానురాగాలతో, **పత్యే + శంసంతీం + సూర్యమ్ =** పతిని పొందు కోరిక గలదైన సూర్య పుత్రి రూప తన కన్యను చూసినవాడై, **సవితా + అదదాత్ =** సూర్యుడు తన కన్యను చంద్రుడికి సమర్పించెను.

పై ఈ అలంకారిక వర్ణనతో స్పష్టమగునదేమన చంద్రుడి ప్రకాశము సూర్యుడి వల్లనేనని. ఇది భారతదేశంలో అందరెరిగినదే. భారతీయ సాహిత్యాలైన కావ్యములు, నాటకములలో కూడా ఈ విషయం చాలాచోట్ల గమనించవచ్చును. అత్యంత ప్రచారములో నున్న ఈ విషయములను కవులు తమ సాహిత్య గ్రంథములలో అటనట పేర్కొన్నారు. మహాకవి కాళిదాసు పౌరాణిక కాలపు పండితుడైనందున తన కావ్యములను వైదికములు, పౌరాణికములుగాను తీర్చిదిద్దినాడు. కాళిదాసు పౌరాణిక కథల ఆధారంగానే దేవతలు, పితరులు అమృతపానము చేయుటవల్లనే చంద్రుడు

తగ్గుతూ పెరుగుతూ ఉంటాడని వర్ణించాడు. వైదికార్థములో సూర్యుడి ప్రకాశము వల్లనే చంద్రుడు ప్రకాశించునని చెప్పాడు.

ఈ క్రింది రఘువంశ కావ్యంలోని శ్లోకమును గమనించండి.

**"పితుః ప్రయత్నాత్ స సమగ్ర సంపదః శుభైః శరీరావయవైః దినే దినే ।**

**పుపోష వృద్ధిం హరిదస్వదీధితేరనుప్రవేశాదివ బాల చంద్రమాః ॥**

– రఘువంశ. 3.22

**భావము:** ధన ధాన్యములతో సమృద్ధుడైన తండ్రి పాలనలో 'రఘు' దినదిన ప్రవర్ధమానుడై సౌష్టవాంగములతో పెద్దవాడు కాజొచ్చెను. బాలచంద్రుడు సూర్యుడి ప్రవేశము వల్ల శుక్ల పక్షమందు దినదినాభివృద్ధి చెందునట్లుగా రఘు పెద్దవాడాయెను.

## చంద్రుడిపై మచ్చ (కళంకము)

లోకంలో ప్రజలు చంద్రుడిపై మచ్చ ఉన్నట్లు భావిస్తారు. తనది కాని ప్రకాశమును చంద్రుడు భూమిపై ప్రసరింపజేస్తూ ఉంటాడు. ఒక మహా దరిద్రుడు యితరుల నుండి యాచించి తీసుకొన్న పై పై వేషభూషలతో తనను తాను ధనవంతుడిగా చూపించుకొనుటకు ప్రయత్నించినచో అది అతనికి కళంకమే కదా. అట్టి వానిని లోకమున ధూర్తుడనియే అందరందురు కదా.

అలాగే ప్రకాశహీనమైన చంద్రుడు కూడా సూర్య ప్రకాశముతో వెలుగొందుట అనునది దానికి కళంకమే కదా.

సూర్య ప్రకాశము వల్లనే చంద్రుడు వెలుగొందునను వైజ్ఞానిక విషయములను ఏమరుచుట వల్లనే అనేక రకాల అభూత కల్పనలు చంద్రుడి విషయమున నెలకొన్నవి.

1) చంద్రుడిపై కుందేలు ఉండటంవల్ల దానిపై నల్లని మచ్చలు కనబడుచున్నవని కొందరు భావింతురు.

2) చంద్రుడు సముద్రము నుండి పుట్టుటవల్ల సముద్రమునందుండు విషముతో తడుచుట వల్ల చంద్రుడిలో కొంత భాగము నల్లగా కనబడునని మరికొందరు భావింతురు.

3) గురుపత్ని 'తార'తో వ్యభిచరించడంవల్ల చంద్రుడు కళంకితుడైనట్లు పౌరాణికులు కొందరు భావింతురు.

ఇలాంటి ఎన్నో అభూత కల్పనలు చంద్రుడి విషయమున దేశంలో ప్రచలితమై యున్నవి. ఇవన్నియు మిథ్యా ప్రేలాపనలేనని భావించవలయును.

## చంద్రుడు : 27 నక్షత్రములు

లౌకిక సంస్కృత భాషలో చంద్రుడిని నక్షత్రాధిపతిగానూ అనగా నక్షత్రములకు స్వామిగా పేర్కొందురు. ఆ నక్షత్రములు 27 లేదా 28 అని పేర్కొనబడినది. చంద్రుడు భూమిచుట్టూ పరిభ్రమించటానికి పట్టు కాలము 28 రోజులే. మొదటిరోజు చంద్రుడు ప్రయాణించు మార్గమునకు అశ్విని అని, రెండవ రోజు ప్రయాణించు మార్గమునకు భరణి అని పేర్లు. ఈ విధముగా 28 రోజుల మార్గమునకు రోజుకో పేరు చొప్పున 28 పేర్లున్నవి.

ఆకాశంలో లెక్కకు మించిన నక్షత్రము లుండగా ఈ 28 నక్షత్రముల పైనే శాస్త్రాలలో యింతగా చర్చలెందుకు. ఇందుకు ఏదో విశేషమైన కారణముండే ఉండును కదా!

వేద శాస్త్రములు ప్రాచుర్యముగా నుండిన ప్రాచీన కాలములో విజ్ఞానము దినదినాభివృద్ధి జరుగుచుండెడిది.

భూమి, సూర్యుడు, చంద్రుడు మొదలగు వాటి స్థితిగతులతో ఆనాటి ప్రజలకు మంచి అవగాహన ఉండెడిదని భావించవచ్చును. చంద్రుడు కూడా భూమిచుట్టూ తిరుగుచున్నదని, అది 28 రోజులలో తన పరిక్రమను పూర్తి చేసుకొంటుందని ఆనాటి ఖగోళ శాస్త్రజ్ఞులు నిర్ధారించారు. దీనిని లెక్కించుటకే వేరువేరుగా 28 రోజులకు ఒక్కొక్క పేరు పెట్టారు. వైజ్ఞానిక విషయముతో ముడిపడి ఉన్నందుననే ఈ 28 నక్షత్రములకు అధిక ప్రాధాన్యము యివ్వబడినది.

ఈశ్వరుడి సృష్టి వైచిత్రి ఎంతో ఆశ్చర్యకరము. అత్యంత విశాలమైన ఈ భూమి సూర్యుడి చుట్టూ, ఆ భూమి చుట్టూ చంద్రుడు పరిభ్రమించుట ఆశ్చర్యమే కదా!

భారతీయులు ఈ వైదిక వైజ్ఞానిక విషయములను మరిచిపోవటం వల్ల ఈ నక్షత్రములకు పట్టిన దుర్గతి అంతా యింతా కాదు. ఈ నక్షత్ర సూచికలు జ్యోతిష్కులకు మంచి సంపాదననే చేసిపెట్టినవి. పౌరాణికులు ఈ నక్షత్రములను చంద్రుడి భార్యలుగా చెప్పుదురు. ఈ పౌరాణిక పండితులు ఆకాశమున కనబడే చుక్కలనే ఈ 28 నక్షత్రములుగా భావించారు. మన పూర్వీకులు ఎంతో కష్టపడి ఎంతటి విజ్ఞాన సముపార్జన చేసిరో వారి వారసులమైన మనము అవైజ్ఞానిక అంధ విశ్వాసములకు లోనై అన్ని విధముల భ్రష్టులమగుట ఎంత ఆశ్చర్యకరము!

## 28 నక్షత్రముల పేర్లు

(1) అశ్విని (2) భరణి (3) కృత్తికా (4) రోహిణి (5) మృగశిర (6) ఆరుద్ర (7) పునర్వసు (8) పుష్యమి (9) ఆశ్లేష (10) మఖ (11) పూర్వఫల్గుణి (పుబ్బ) (1) ఉత్తర ఫల్గుణి (13) హస్త (14) చిత్త (15) స్వాతి (16) విశాఖ (17) అనురాధ (18) జ్యేష్ఠ (19) మూల (20) పూర్వాషాఢ (21) ఉత్తరాషాఢ (22) శ్రావణ (23) ధనిష్ఠ (24) శతభిష (25) పూర్వ భాద్రపద (26) ఉత్తర భాద్రపద (27) రేవతి (28) అభిజిత్.

## వేదములలో నక్షత్రముల వర్ణన

**ఓం చిత్రాణిసాకం దివిరోచనాని సరీసృపాణి భువనే జనాని ।**
**అష్టావింశం సుమతి మిచ్ఛమానో అహాని గీర్భిః సర్పయామి నాకం ॥1॥**

**ఓం సుహవం మే కృత్తికారోహిణీ చాస్తు భద్రం మృగశిరః సమార్ద్రా ।**
**పునర్వసు సునృతా చారు పుష్యో భానురశ్లేషా అయనం మఘా మే ॥2॥**

**ఓం పుణ్యం పూర్వా ఫల్గున్యౌ చాత్ర హస్తశ్చిత్రా శివాస్వాతిః సుఖోమే అస్తు ।**
**రాధో విశాఖే సుహవానురాధా జ్యేష్ఠాసునక్షత్ర మరిష్టం మూలమ్ ॥3॥**

**ఓం అన్నం పూర్వా రాసంతమే ఆషాఢా ఊర్జే యే హ్యుత్తర ఆవహంతు ।**
**అభిజిన్మే రాసతాం పుణ్యమేవ శ్రవణః శ్రవిష్ఠా కుర్వతాంసుపిష్టిమ్ ॥4॥**

**ఓం ఆ మే మహచ్ఛతభిషగ్వరీయ ఆమే ద్వయాప్రోష్ఠపదాసుశర్మ ।**
**ఆరేవతి చాశ్వయుజౌ భగం మ ఆమే రయిం భరణ్య ఆవహంతు ॥5॥**

– అథర్వ. 19.7.1 నుండి 5

**ఓం అష్టావింశాని శివాని శగ్మాని సహయోగం భజంతు మే.**

– అథర్వ. 19.8.2

ఇచట 28 నక్షత్రములకు 'శగ్మ' పదము విశేషముగా చెప్పబడినది. 'శగ్మ' మనగా కల్పిత మార్గమే. చంద్రుడు ప్రయాణించు మార్గమునకే శగ్మమని పేరు.

చంద్రుడు పయనించు మార్గమును సూచించు ఆ నక్షత్రములే నేడు శుభ అశుభ ఫలములకు కారణభూతమై ధూర్తుల ధనార్జనకు సాధనములగుట విడ్డూరమే కదా!

## గ్రహణము : ECLIPSE

ఈ గ్రహణమును గురించిన చర్చ సిద్ధాంత శిరోమణి మొదలగు జ్యోతిశ్శాస్త్రములలో చాలా విస్తారముగా నున్నది. భూమి నీడ చంద్రుడిపై పడునపుడు చంద్ర గ్రహణము మరియు చంద్రుడి నీడ భూమిపై పడునపుడు సూర్య గ్రహణము ఏర్పడుననుట ఆబాలవృద్ధులు – అందరూ ఎరిగినదే.

ఈ విషయమును మహాకవి కాళిదాసుడు తన 'రఘువంశ' కావ్యమున ఒక మంచి ఉదాహరణతో వర్ణించినాడు. చూడండి.

**"అవైమి చైనామనఘేతి కింతు లోకాపవాదో బలవాన్ మతో మే ।**
**ఛాయాహి భూమేః శశినో మలత్వేనారోపితాశుద్ధిమతః ప్రజాభిః ।।"**

– రఘువంశ. 14.40

శ్రీరామచంద్రుడు సీతను గూర్చి యిలా అంటాడు –

"సీత నిఃష్కలంక యని నేనెరుగుదును. అయినప్పటికీ లోకోపవాదు – ప్రజలలో నెలకొన్న దురభిప్రాయము చాలా బలమైనది. కావున దానిని నేనంగీకరించవలసినదే. ఉదాహరణకు చంద్రుడు నిర్మలుడైనప్పటికీ దానిపై పడు భూమి నీడను జూచి చంద్రుడు కళంకితుడని లోకము నమ్ముచున్నది కదా!"

పై వర్ణన వల్ల భూమినీడ వల్లనే గ్రహణము కలుగుచున్నదని సిద్ధించుచున్నది కదా.

## చంద్రుడు తరుగుట - పెరుగుట

సూర్య కిరణములు చంద్రుడిపై ఎల్లపుడు పడుచునే యుండును. భూమి తిరుగుచుండుట వల్ల భూమిపై నుండు మానవులు చంద్రుడి ప్రకాశమును ఎల్లపుడు చూడలేరు. భూమినీడ చంద్రుడిపై పడుచుండుట వల్ల కూడా చంద్రుడి ప్రకాశమును ఎల్లవేళలా చూడలేము. కావుననే చంద్రుడు తరుగుతున్నట్లు, పెరుగుతున్నట్లు కనపడును.

## వేదాలలో గ్రహణం గూర్చిన వర్ణన

వేదాలలోని కొన్ని సందిగ్ధ వర్ణనల వల్ల రాహువు కేతువుల వల్లనే గ్రహణము లేర్పడునను భ్రమపూర్వక కథలు ప్రచారములోకి వచ్చినవి. ఉదాహరణకు...

**ఓం  యత్వా సూర్య స్వభానుస్తమసా విధ్యదాసురః ।**
**అక్షేత్రవిద్ యథా ముగ్ధో భువనాన్య దీధయుః ।।**

– ఋ. 5.40.5

**అర్థము: సూర్య** = ఓ సూర్యుడా!, **యద్** = ఎప్పుడు, **త్వా** = నీకు, **ఆసురః** = అసుర పుత్రుడు. **స్వర్భానుః తమసా** = అంధకారముతో, **అవిద్యత్** = కప్పుకుంటుందో అపుడు, **భువనాని** = సంపూర్ణ లోక లోకాంతరములు సంభ్రాంతములైనట్లు – ఆశ్చర్యచకితులు అయినట్లు, **అదీధయుః** = కనబడసాగును, **యథా** = ఎట్లు, **అక్షేత్రంవిత్** = దారి తెలియని బాటసారి, **ముగ్ధః** = మోహితుడైనట్లు – బయటపడినట్లు సంపూర్ణ జగత్తు భయపడును.

**ఓం  యంవై సూర్యం స్వభానుస్తమసా విధ్యదాసురః ।**
**అత్ర యస్త మన్వ విందన్నహ్యన్యే అశక్నువన్ ।।**

– ఋ. 5.40.9

**అర్థము:** ఆసురః + స్వభాను = అసుర పుత్రుడైన స్వభాను, యం + వై + సూర్యం = సూర్యుడిని, తమసా + అవిధ్యత్ = అంధకారముతో నింపునో, అత్రయః = అత్రి గణము, తం + అను + అవిందన్ = అంధకారమును నశింపజేసి సూర్యుడిని కాపాడును. ఇలాంటి వర్ణనలు ఋగ్వేదములో అటనట కనబడును. ఈ విషయమును –

శతపథ బ్రాహ్మణము నుండి ఒక ఉదాహరణతో స్పష్టముగా తెలుసుకొన ప్రయత్నించెదము.

**"స్వభానుర్హ్వా ఆసురః సూర్యం తమసా వివ్యాధ స తమసా విద్ధోన వ్యరోచత**
**తస్య సోమారుద్రావేవైతత్తమోऽపాహతాంసఏషోऽపహతపాప్మాతపతి.**

– శ.బ్రా. 5.1.2.1

అసుర శబ్దము ఋగ్వేదములో దుష్టార్థములో చాలాచోట్ల ప్రయోగించబడినప్పటికి సూర్యుడు, మేఘము, వాయువు, వీరుడు, పరమాత్మ అను అర్థములలో కూడా ప్రయోగింపబడిటన్లు చూడనగును.

**ఓం విసుపర్ణో అంతరిక్షాణ్యరవ్యద్ గబీరవేపా అసురః సునీథః ।**
**క్వేదానీం సూర్యః కిశ్చికేత కతమాం ద్యాం రస్మి స్యాతతాన ॥**

– ఋ. 1.35.8

ఇచట సూర్యునికి విశేషణముగా అసుర శబ్దము ప్రయోగింపబడినది. సూర్యుడి ప్రకాశము వల్లనే చంద్రుడు ప్రకాశించుచున్నాడు. (అసురస్య సూర్యస్య అయం ఆసురః)

అసురుడికి సంబంధించిన వాడు అయినందుననే చంద్రుడు ఆసురుడనబడును.

**స్వభాను:** స్వ = స్వర్గము–ఆకాశము–అంతరిక్షము, భానుః = ప్రకాశము, అనగా స్వర్గమును – అంతరిక్షమును ప్రకాశింప జేయువాడు కావుననే చంద్రుడు అసురుడనబడుచున్నాడు.

**అత్రి:** సూర్య కిరణముల పేరే అత్రి. "అదంతి జలాని యే తే అత్రయః కిరణాః"

పై పదముల యొక్క వైదికార్థములపై దృష్టి సారించినచో ఆసురుడైన చంద్రుడు స్వర్భానుడై సూర్యుని అంధకారముతో కప్పి వుంచును. చంద్రుడు తన ఛాయా రూపమయిన అంధకారముతో సూర్యుణ్ణి కప్పి ఉంచును. అపుడు అత్రి అనగా సూర్య కిరణములే అంధకారమును తొలగించి సూర్యుడిని రక్షించుచున్నట్లుగా గోచరించును. శతపథ బ్రాహ్మణమునందును సోముడు మరియు రుద్రుడు ఈ అంధకారమును నష్టపరుచుదురని చెప్పబడినది. చంద్రుడే తన నీడను సూర్యుడిపై ప్రసరింపజేసి కొంతసేపటికి అక్కడినుండి దూరముగా జరుగును. అనగా మళ్ళీ ప్రకాశము వచ్చును. సూర్యుడు అంధకారము నుండి విడివడును. ఇదే వైదికమైన సాధారణ విషయము. ఇది తెలియక అనేకానేక కపోల కల్పితములు ప్రచారం చేయబడినవి.

ఆధునిక సంస్కృత శబ్దకోశమైన అమర కోశములో 'తమస్తు రాహుః స్వర్భానుః – సైంహి కే యో విధుంతుదః" అని చెప్పబడినది.

'స్వర్భాను' పదమే రాహువునకే పర్యాయ పదమని ఉండగా, దానినొక ప్రత్యేకమైన జాతిగా భావించి ఇలాంటి భ్రమజాలాన్ని వ్యాపింపజేసియున్నారు. ఇట్టి స్వల్పమైన వైదిక విషయమున అనేక కథలను అల్లినారు. కావున ప్రజలు వేదముల వైపు మళ్ళి వాటి యొక్క యథార్థమైన భావములను తెలుసుకొనుట వల్లనే తమలో వున్న అజ్ఞానము నుండి / కుసంస్కారముల నుండి బయటపడగలరు.

## గ్రహణ మనగానేమి? What is Eclipse?

చంద్ర గ్రహణము రోజున చంద్ర మండలము సంపూర్ణముగా కనబడును. నాడు చంద్ర మండలము పైన నల్లని, ఎర్రని నీడలు కనబడుతాయి. ఇలాంటి నీడలు ఒకప్పుడు చంద్రమండల మంతయు, మరొకప్పుడు కొంత భాగములో కనబడును. సూర్య గ్రహణ మిందుకు విలక్షణమైనదిగా నుండును. ఈ సమయమున సూర్య గ్రహణము కొంత భాగము ఆవరించియుండును.

### గ్రహణము రెండు రకాలుగా ఏర్పడుతుంది.

1) సూర్యుడు మరియు చంద్ర మండలములలో కొంత భాగము నీడతో కప్పబడుతుంది. దానినే "పాక్షిక గ్రహణము" అంటారు. ఎంత భాగము కనబడుతుందో అంతే భాగము మనము గ్రహణమును చూడగలము.

2) సంపూర్ణ గ్రహణము సమయమున భూమిపై ఆశ్చర్య జనకమైన లీలలు కనబడుతాయి. భూమిపై ఆ రోజు విచిత్రమైన అంధకారం ఏర్పడుతుంది. రాత్రితో సమానముగా అంధకారము గాని, ఉషోదయవేళ లాగా ప్రకాశముగాని వుండదు. ఆకాశములో చుక్కలు కనబడతాయి. పక్షులు తమ గూళ్ళకు పరుగెడుతాయి. నిశాచర జంతువులు రాత్రి అనుకొని బయటకు వస్తాయి. అజ్ఞానులైన ప్రజలు భయపడుతారు. చాలారోజుల క్రిందటి విషయం. రెండు దేశాల మధ్య యుద్ధము జరుగుతుండగా యిలాంటి సూర్యగ్రహణమే సంభవించింది. రెండు దేశాల సైనికులు భయపడి యుద్ధమును ఆపి సంధి కుదుర్చుకొన్నారు. సూర్యగ్రహణ సమయమున నేటికిని అజ్ఞానులయిన జనులు భయపడుచుందురు. ఏదో ఒక గొప్ప రాజు చనిపోవడం గాని, కరువు కాటకాలు గాని, అతివృష్టి, అనావృష్టి కాని, మహమ్మారి లాంటి అంటువ్యాధులు కాని, మహాయుద్ధములు గాని, భూకంపములలాంటి ఉపద్రవములు గాని వచ్చిపడుతాయని శంకింతురు. ఇవియన్నియు అబద్ధములే. గ్రహణములకు మరియు మృత్యువు, కరువు కాటకములకు సంబంధమే లేదు.

## గ్రహణం విషయంలో అనేక రకాల కల్పనలు

గ్రహణ మేర్పడుటకు గల యథార్థ విషయ పరిజ్ఞానము లేని దేశాలలో అనేక రకాల కల్పిత కథనాలను ప్రాచుర్యములోనికి తెచ్చినారు.

1) ప్రాచీన కాలములో 'రోమ్' నగరవాసులు చంద్రుడిని ఒక దేవతగా భావించెడివారు. గ్రహణ సమయమున ఆ దేవత తన పిల్లలతోపాటు కష్టపడుతుందని భావించి, ఆ దేవతకు తోడ్పాటుగా జంతు బలులను యిచ్చెడివారు. ఒక మంత్రకారుడు చంద్రునికి దుఃఖము కలిగించుట వలన దానిపై నల్లటి మచ్చలేర్పడినవని భావించెడివారు.

2) అమెరికా దేశవాసులు కొందరు చంద్రుడు అనారోగ్యము పాలైనపుడు గ్రహణమేర్పడునని భావించెడివారు. అప్పుడు చంద్రుడు తమపై పడిపోయి తాము నశించిపోవుదుమని కూడా నమ్మెడివారు. ఈ ఉపద్రవముల నుండి బయటపడుటకు, చంద్రుడిని మేల్కొలుపుటకు పెద్ద పెద్ద నగారాలతో శబ్దము చేయుచుండెడివారు. కుక్కలను పరిగెత్తించి గట్టిగా అరిపించెడివారు. తాము స్వయముగా అరిచెడివారు. చంద్రుడి ఆరోగ్యము కుదుటపడుటకై దేవతలను ప్రార్థించెడివారు.

3) అమెరికా ఖండపు మెక్సికో దేశవాసులు చంద్రుడు మరియు సూర్యుడి మధ్య భీకర యుద్ధము జరిగి, అందు చంద్రుడు పరాజితుడై గాయపడటం వల్ల యిలాంటి పరిస్థితి 'గ్రహణం' ఏర్పడునని విశ్వసించెడివారు. వారు గ్రహణ సమయమున ఉపవాసం చేయుదురు. స్త్రీలు భయపడి తమ్ముతాము కొట్టుకొనెడివారు. కన్యలు తమ బాహువులనుండి రక్తము చిందించెడివారు. ఇది చూసి పిల్లలు ఏడ్చెడివారు.

4) ఆఫ్రికా దేశవాసులు యిప్పటికీ అజ్ఞానములోనే ఉన్నారు. ఇక్కడి నీగ్రో జాతి గిరిజనులు పశువులవలె అతిమూర్ఖులు. వీరిలో చాలా జాతులు యిప్పటికీ దుస్తులు ధరించటం ఎరుగరు. చంద్రగ్రహణ సమయమున అక్కడనున్న ఒక విదేశీ యాత్రికుడు అక్కడ తాను చూసిన కొన్ని విషయములను ఈవిధముగా వర్ణించియున్నాడు.

ఒకరోజు సాయం సంధ్యవేళ శీతల వాయువులు వీచుచుండగా ప్రజలు అత్యంత ఆనందముతో అటునిటు తిరుగుతూ వాతావరణమును ఆస్వాదించుచుండిరి. నాటి పూర్ణచంద్రుడిని, దాని ప్రకాశమును వెన్నెలను చూసి చాలా సంతోషపడసాగిరి. అంతలోనే చంద్రుడు కొంచెము కొంచెముగా నల్లబడటం ప్రారంభించెను. ఆపై సంపూర్ణ గ్రహణ మేర్పడింది. చంద్రుడు నల్లబడుతున్నకొద్దీ ప్రజలలో ఉత్సాహము, ఉల్లాసము తగ్గుతూ ఆందోళన పెంపొందసాగెను. సంపూర్ణ గ్రహణ సమయమున ప్రజలు భయపడి అటునిటు పరుగెత్తసాగిరి. అప్పుడు కొందరు వందల సంఖ్యలో ప్రజలు రాజు కడకు పరుగెత్తుకొనిపోయి ఆకాశమున నేమి జరుగుతున్నదని తమ ఆందోళనను రాజుకు వ్యక్తపరిచిరి. చంద్రుడు దాగుకొనుటకు ఆకాశమున మేఘములు కూడా కానరావడంలేదు అని తలంచుచు పరస్పరము ఆశ్చర్యము, ఆందోళనతో కూడిన ముఖములతో ఏ ఆపద రానున్నదోయన్న భావనతో ప్రజలుండిరి. గ్రహణము యొక్క యథార్థ జ్ఞానము లేకపోవడంవల్లనే యిలాంటి పరిస్థితికి లోనగుచుండిరి. చాలామంది గట్టిగా అరవసాగిరి. కొందరు ఢంకాలను మ్రోగించుచు, ఇంకొందరు తురీయములను ఊదుతూ వుండిరి. సర్పరూప ఒక పెద్ద రాక్షసుడు చంద్రుడిని మ్రింగబోవుచున్నాడని అతనిని ఈ పెద్ద పెద్ద శబ్దములతో భయపెట్టినచో చంద్రుడిని వదిలిపారిపోవునని వారి విశ్వాసము. కొద్దికొద్దిగా చంద్రుడు తెల్లబడుటను చూచి ఆ నీగ్రోలు ఆనందపడుతూ తమ ప్రయత్నముల వల్లనే యిది జరిగినదని గొప్పగా చెప్పుకొనసాగిరి.

5) భారతీయ పూర్వికులకు గ్రహణము గురించిన యథార్థ జ్ఞానమున్నప్పటికీ నేటి భారతీయులు కూడా ఈ ఆటవికుల వలెనే గ్రహణమును భావించుట ఎంతయో శోచనీయము. జ్యోతిశ్శాస్త్రములు భూమి నీడవల్లనే చంద్ర గ్రహణము, చంద్రుడి నీడవల్ల సూర్య గ్రహణము ఏర్పడునని ఎలుగెత్తి చాటుచుండగా కొందరు అజ్ఞాన వశమున రాక్షసుడు మ్రింగుటవల్ల లేదా సర్పము మ్రింగుటవల్ల గ్రహణమేర్పడునని భావించుట ఆశ్చర్యకరమే.

చంద్రుడు, సూర్యుడు మొదలగు గ్రహోపగ్రహములు జడపదార్థములు. ప్రతిరోజు వాటి నీడల రూపములో గ్రహణములేర్పడుచునే యున్నవి. అందువలననే చంద్రుడు తరుగుతూ, పెరుగుతూ ఉంటుంది. మేఘములు అడ్డువచ్చినప్పుడు చంద్రుడు, సూర్యుడు దాగుకొన్నట్లు కనబడునట్లే గ్రహణ సమయమున కూడా జరుగునని భావించాలి.

గ్రహణము వల్ల ఎలాంటి ఉపద్రవములు – మహమ్మారి, అతివృష్టి, అనావృష్టి లాంటివి ఏర్పడవని జ్యోతిశ్శాస్త్రములవల్ల స్పష్టమగుచుండగా, లోకమున అజ్ఞానవశమున ఎన్నో మూఢ నమ్మకములు ఈ విషయమున నెలకొన్నవి.

గ్రహణం సమయమున వేలు, లక్షలమంది ప్రజలు కాశీ, ప్రయాగ, కురుక్షేత్రము లాంటి పుణ్య క్షేత్రములవైపు పరుగిడుదురు. చంద్రుడుని, సూర్యుడిని రాహువు పేరుగల రాక్షసుడి బారినుండి కాపాడుటకు, జప, తపములు, దాన ధర్మములు, పూజలు చేయదొడగుదురు. గ్రహణమును అశుభమని భావించి కాశీ, గంగా, కురుక్షేత్రాది పుణ్య క్షేత్రములలో స్నానమాచరించిన శుభము కలుగునని భావింతురు. క్షుద్ర పూజారులు, ఉన్మత్తులైన సాధువులు, గ్రహణమేర్పడుచున్నది కాన దాన ధర్మములు చేసి పుణ్యమును మూటగట్టుకొండని అరుచుచుండుట లాంటి విచిత్ర లీలలు నేటికీ భారతదేశమున కనబడుచుండుట కడుశోచనీయము. పురాణములు యిక్కడి తాత్విక విద్యలను – యథార్థ జ్ఞానమును నష్టభ్రష్టము చేసినవి. అజ్ఞానభరితమైన ఎన్నో కథలను కల్పించినారు.

అది ఎట్లన...

దేవతలు, రాక్షసులు కలిసి సముద్ర మథనము చేసి అమృతమును పొందిరి. ఆ అమృతమును తీసుకొని రాక్షసులు పరుగెత్తగా దేవతలు అసహాయులుగా ఉండిపోయిరి. అపుడు విష్ణువు మోహినీరూపమును ధరించి రాక్షసుల చెంతకు చేరి వారిని ప్రలోభపెట్టి అమృత కలశమును తీసుకొని రెండు పక్షములకు సమానముగా పంచుటకు ఒప్పించి మనసున పక్షపాత బుద్ధితో అమృతమును పంచనారంభించెను. మొదట దేవతలకు పంచనారంభించెను. అసురులలోని రాహువు విష్ణువు యొక్క పక్షపాతబుద్ధిని గమనించి తాను దేవతలైన సూర్య చంద్రుల మధ్య చేరి కూర్చొనెను. విష్ణువు దేవతల మధ్య కూర్చున్న రాహువుకు అమృతము పంచుటకుద్యుక్తుడయ్యెను. సూర్య, చంద్రులు సైగ చేయునంతలోనే కొంత అమృతము రాహువు చేతిలో పడినది. దానిని అతడు సేవించడం కూడా జరిగింది. విష్ణువు యిది గమనించి తన చక్రముతో అతడి తలను నరికివేసెను. అప్పుడు అది రెండుగా చీలి రాహువు, కేతువులుగా ఏర్పడినది. అప్పటినుండి ఆ రాహువు కేతువులు తమ శత్రువులయిన సూర్య చంద్రులకు గ్రహణ రూపమున దుఃఖము కలిగించుచునే ఉన్నారు. ఇది ఒక పౌరాణిక కల్పిత కథ.

6) చైనా దేశవాసులు కూడా నీగ్రోలు, హిందువుల మాదిరిగానే ఎరుపు, నలుపులతో కూడి ఒక సర్పము సూర్య చంద్రులను గ్రహణ రూపమున బాధించునని భావింతురు. వారు హిందువుల వలె తీర్థ స్నానములు, స్తోత్ర పఠనములు చేయరు కాని ఆఫ్రికా గిరిజనుల వలెనే అందరు కలిసి గట్టిగా అరుస్తూ, ఢోలు వాయిస్తూ అల్లరి చేయడం ద్వారా ఆ సర్పము పారిపోవునని భావింతురు.

ఈ విధముగా గ్రహణము విషయమున భిన్న భిన్న ప్రాంతములలో భిన్న భిన్న మతావలంబులలో రకరకాల కల్పనలు ప్రాచుర్యంలో నున్నవి. ఈ కల్పనలన్నీ అజ్ఞాన భరిత అభూత కల్పనలే.

సూర్యచంద్రులు చూచుటకు చిన్నగా కనిపించినను అవి కూడా భూమివలెనే పెద్ద లోకములే. చంద్రుడు భూమికంటే కొంత చిన్నగుండును. ఇక సూర్యుడి గురించి చెప్పవలెనన్న భూమికంటే 13 లక్షల రెట్లు పెద్ద గోళం. అది ఒక అగ్ని సముద్రమే. ఈ సూర్యుడి చుట్టూ కొన్ని లక్షల యోజనముల పరిధిలో శరీరధారులైన జీవరాసులు సూర్యుడి అగ్నిజ్వాలల వల్ల బ్రతుకలేవు. ఈ భూమండలమును సముద్రములు, పర్వతములతో సహా సూర్యమండలమున వేసినచో క్షణకాలములో భస్మమైపోవును. ఇలాంటి విశాలమైన భూమండలము పరిస్థితియే సూర్యుని ముందు ఈవిధముగా నుండగా సర్పము, రాహువు లాంటి వాటి పరిస్థితి ఏమిటి? అవి సూర్యుడి దగ్గరికి వెళ్ళగలవా? కావున పురాణ కథలన్నీ అభూత కల్పనలే. ఈ గ్రహణములు రాహువు వల్లనే కలుగునని భావించినచో నియమబద్ధంగా పూర్ణిమ, అమావాస్య రోజులలోనే చంద్ర, సూర్య గ్రహణములు ఎందుకు ఏర్పడుచున్నవి? అసురుడైన రాహువు సర్వ స్వతంత్రుడు కదా! అతడు తన యిష్టము వచ్చినపుడు సూర్య చంద్రులను పట్టిపీడించగలడు కదా! కావుననే యిది కల్పిత కథలు అనుటలో సందేహము లేదు.

జ్యోతిశ్శాస్త్ర విద్వాంసులు వందల ఏండ్లకు ముందే గ్రహణము ఏర్పడు నెల, తిథి, నక్షత్రము, క్షణములను లెక్కించి చెప్పుటయేగాక, ఏ క్షణమున గ్రహణము ప్రారంభమగునో, ఏ క్షణమున గ్రహణము వీడునో కూడా తెలుపుతున్నారు. ఏదో సర్పము, లేదా రాహువు వల్ల ఈ గ్రహణ మేర్పడినచో పండితులీ విషయమును లెక్కించి చెప్పలేరు కదా! కావున ఉపర్యుక్త కల్పనలన్నీ అజ్ఞానముతో ఏర్పడిన మిథ్యా కల్పనలే. కావున యివి అన్నియు విడిచిపెట్టదగినవే.

భూమి నీడ చంద్రుడిపై పడుటవల్ల చంద్రగ్రహణ మేర్పడును. కావున చంద్ర గ్రహణము రోజున చంద్రుడు కొంత ఎరుపురంగులో కనిపించును. చంద్రుడి నీడ భూమిపై పడుటవల్ల సూర్య గ్రహణమేర్పడును. స్వతఃగా చంద్రుడు ఎల్లవేళల నల్లగానే ఉండును. కావున సూర్య గ్రహణం సమయమున సూర్యుడు నల్లగా కనబడును. అందువల్లనే

కాబోలు ఎరుపు నలుపుల సర్పపు కథను కల్పించినారు. ఒక సంవత్సర కాలంలో కనీసం 2 సార్లు అత్యధికముగా 7 సార్లు గ్రహణములేర్పడును. సాధారణంగా సంవత్సరకాలంలో 4 సార్లు గ్రహణము లేర్పడుచుండును.

## వేదాలలో వైమానిక విద్య : AIRONAUTICS

**ఓం విమాన ఏష దివో మధ్య ఆస్త ఆపప్రివాన్ రోదసీ అంతరిక్షమ్ ।**
**సవిశ్వాచీరభి చష్టే ఘృతాచీరంతరో పూర్వ మపరంచ కేతుమ్ ॥**

– యజు. 17.59

**అర్థము: దివః + మధ్యే** = ఆకాశము మధ్యలో, **ఏషః + విమాన + ఆస్తే** = విమానము వలె నున్నది. **రోదసీ + అంతరిక్షమ్** = ద్యులోక, పృథివీలోక, అంతరిక్ష లోకములనబడు త్రిలోకములందు, **ఆపప్రివాన్** = అప్రతిహతగతి కలదియై యున్నది. **విశ్వాచీః** = విశ్వమంతయు ప్రయాణించతగినదై, **ఘృతాచీః = ఘృత్** = జలము, మేఘములపై భాగమందు ప్రయాణించగలది, **సః** = అట్టి విమానమును అధిరోహించిన మానవుడు, **పూర్వం** = ఈ భూమండలము, **అపరంచ** = ఇతర గ్రహోపగ్రహముల మధ్యన ఉన్న, **కేతుం** = ప్రకాశమును, అభిచష్టే = అన్నివైపుల గమనించును.

ఈ మంత్రంలో స్పష్టముగా 'విమాన' శబ్దము ప్రయోగింపబడుట చూడనగును. విమానగతిని గూర్చిన వర్ణన కూడా కలదు. ఆ విమానమును అధిరోహించు వ్యక్తి స్థితి కూడా వివరింపబడినది. దీనినిబట్టి నాటి ఋషులు విమానవిద్యను బాగుగా ఎరిగినవారని స్పష్టమగుచున్నది. ఈ విషయమున ప్రచలితమైన ఒక కథను గమనించవచ్చును. ప్రాచీన కాలమున కుబేరుని దగ్గర ఒక విమానముండెడిది. దానిని రావణుడు జయించి స్వాధీనపరచుకొన్నాడు. శ్రీరామచంద్రుడి లంకా విజయం తరువాత ఆ విమానముపైనే అయోధ్యకు తిరిగి వచ్చెను.

## వేదాలలో 'సృష్టి' విజ్ఞానము : CREATION OF UNIVERSE

వేదాలలో "సృష్టి రచన"ను గురించిన వర్ణన అద్భుతముగా నున్నది. వేదాలలో కథలు, కథానికలుండవు. లౌకిక గ్రంథాలలో మాదిరిగా తల తోకలేని గప్పాలుండవు. మంత్రద్రష్టలైన ఋషులు అత్యంత లోతైన ఈ సృష్టి రచన విషయమును అనేక ప్రశ్నల రూపమున ప్రస్తావించిరి. వేదార్థములను తెలుసుకోగోరు జిజ్ఞాసువులు ఈ ప్రశ్నలను లోతుగా అర్థము చేసుకొనుటకు ప్రయత్నించవలెను. ఈ ప్రశ్నలు అత్యంత రోచకమైనవి. ఈ ప్రశ్నల ద్వారానే ఋషుల ఆంతరిక మనోభావనలు అర్థమగును. ఈ ప్రశ్నలతో కూడిన మంత్రములే మనలను గొప్ప జిజ్ఞాస వైపు నడిపిస్తాయి. అట్టి జిజ్ఞాసయే మానవుడిని నేటి ఆధునిక విజ్ఞానదశకు చేర్చినవి.

జ్ఞానాన్వేషణ లేని సమాజము మృతప్రాయమగును. అట్టి సమాజ అభివృద్ధి ఎన్నటికీ జరుగనేరదు. ఋషులు ఈ వేద మంత్రముల ద్వారా ఎలాంటి విలక్షణమైన ప్రశ్నలడుగుచున్నారో జాగ్రత్తగా పరిశీలిద్దాం...

**ఓం కిం స్విదాసీదధిష్ఠానమారంభణం కతమత్స్విత్ కథాసీత్ ।**
**యతో భూమిం జనయన్ విశ్వకర్మా విద్యా మమౌర్ణోత్మహినావిశ్వచక్షాః ॥**

– ఋ. 10.81.2

**అర్థము:** లోక వ్యవహారమున కుమ్మరి, సాలెవాడు, లేదా వడ్రంగి మొదలగువారు కుండ, వస్త్రము మొదలగువాటిని తయారు చేయుటకు మొదట వాటికి అవసరమైన సాధన సామగ్రిని సమకూర్చుకొంటారు. తరువాత ఒక స్థానమందు కూర్చొని వాటిని తయారు చేస్తారు. అలాగే పరమేశ్వరుడు కూడా చేయవలసియుండును. కావుననే ఋషి విశ్వకర్మా ప్రశ్నించుచున్నాడు...

**స్విత్** = నేను ప్రశ్నిస్తున్నాను. ఆ పరమేశ్వరుడు **అధిష్ఠానమ్** = కూర్చొను స్థానము, **కిమ్ + ఆసీత్** = ఏది?, **ఆరంభణం + కతమమ్** = సృష్టిని ప్రారంభించుటకు తగు సాధన సామగ్రి ఏది?, **స్విత్** = మళ్ళీ ప్రశ్నిస్తున్నాను, **కథా + ఆసీత్** = సృష్టిని చేయు ప్రక్రియ ఏది?, **యతః** = ఏ సమయమున, **విశ్వచక్షాః** = సర్వద్రష్టమైన, **విశ్వకర్మా** = సర్వ కర్తయైన పరమేశ్వరుడు, **భూమిం** = భూమిని, **ద్యాం** = ద్యులోకమును, **జనయన్** = ఉత్పన్నము చేయుచూ, **మహినా** = తన మహత్వముతో, **వి + అర్ణోత్** = సంపూర్ణ జగత్తును ఆవరించును? అప్పుడు అతనికి అందుబాటులో ఎలాంటి సాధన సామగ్రి మరియు ఆధారము ఉన్నదో ననునది ఒక ప్రశ్న, **విశ్వచక్షా** = అన్నింటినీ చూడగల సామర్థ్యము గలవాడు, **విశ్వకర్మా** = సర్వమును నిర్మించగలవాడు.

ఇలాంటిదే మరో ప్రశ్న:

ఓం **కిం స్విద్ వనం క ఉ స వృక్ష ఆ స యతో ద్యావా పృథివీ నిష్టతక్షుః ।**
**మనీషిణో మనసా పృచ్ఛ తేదు తద్య దధ్య తిష్టద్ భువనాని ధారయన్ ॥**

– ఋ. 10.81.4

**అర్థము:** లోకమున అరణ్యమునందలి వృక్షములను నరికి వివిధ రకాల భవనములను నిర్మించుచుండుట చూడనగును. సృష్టిరూప భవనమును నిర్మించుటకు ఈశ్వరుని కడ ఏ అరణ్యమున్నది? **స్విత్** = నేను ప్రశ్నిస్తున్నాను, **కిమ్ + వనమ్** = ఏ అరణ్యమున్నది, **కః + ఉ + సః + వృక్షః + ఆస** = ఏ వృక్షమున్నది?, **యతః** = ఏ అరణ్యములోని వృక్షముతో, **ద్యావా పృథివీ** = ద్యులోక పృథివీ లోకములను, **నిష్టతక్షుః** = చెక్కి సుశోభితము చేయుచున్నాడు. **మనీషిణః** = మననశీలులైన మీరందరు, **మనసా** = మనసున బాగా ఆలోచించి, **తత్ + ఇత్ + ఉ + పృచ్ఛత్** = అడుగుదురు గాక!, **భువనాని + ధారయన్** = ఈ సృష్టినంతటిని ధరించుచు, **యద్ + అధి + అతిష్ఠత్** = అధిష్ఠితుడై యున్నాడు.

ఈ మంత్రమున రెండు ప్రశ్నలు ప్రధానముగా మనకు గోచరించుచున్నవి.

1) ఈ సృష్టి నిర్మాణమునకు కావలసిన సాధన సామగ్రి ఏమిటి?

2) పరమేశ్వరుడు అన్నింటినీ నిర్మించి, అన్నింటినీ అంటిపెట్టుకొని, అన్నింటికీ ఆధారముగా ఎలా వున్నాడు?

ఓం **విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతోబాహురుత విశ్వతస్పాత్ ।**
**స బాహుభ్యాం ధమతి సంపతత్రైర్ద్యావా భూమీ జనయన్ దేవ ఏకః ॥**

– ఋ. 10.81.3

**అర్థము:** ఏ పరమేశ్వరుడు **విశ్వతశ్చక్షుః** = అన్నివైపుల నుండి చూచుచూ ప్రసిద్ధుడైయున్నాడో, **విశ్వతోముఖః** = అన్నివైపుల నెవని ముఖము – దృష్టి యున్నదో, **విశ్వతోబాహుః** = సర్వమును ఎవడు బాహువులతో వలె పట్టి ఉంచినాడో, **విశ్వతస్పాత్** = ఎవని పాదములు అంతట నున్నవో– అంతట వ్యాపించి యున్నాడో, **ఏకః + దేవః** = ఆ గొప్ప దేవుడు ఒక్కడే అతడు, **బాహుభ్యాం** = బాహువులతోవలె, **సంధమతి** = పదార్థములందన్నింటిలో గతిని కలిగించును, **పతత్రైః** = గతిమంతమైన, వ్యాపకమైయున్న పరమాణువుల నుండి, **ద్యావా పృథివీ** = ద్యులోక భూలోకములను, **సంజనయన్** = ఉత్పన్నము చేయుచున్నాడు.

ఒకే ఒక్కడు అయిన ఆ పరమేశ్వరుడు ఎవరి ఆధారము లేకుండా విద్యమానుడై యున్నాడు. సర్వవ్యాపకుడైన పరమేశ్వరుని విషయమున మరొక ఆధారము గురించిన ఆలోచనయే ఉత్పన్నము కారాదు. వ్యాపకము కాని, ఒక్కచోటనే ఉండు వస్తువునకు ఆధారమవసరము. కాని పరమేశ్వరుడు ఈ దృశ్యమాన ప్రపంచమంతయు అనగా

పైనా, క్రింద, లోపల, బయట, నలువైపుల అంతట నిండియున్నాడు. అతనికి మరొక ఆధారమను ప్రశ్నయే ఉత్పనము కాదు. పతత్రః = పతనశీలము – గతిమంతమైన పదార్థములు ఎల్లప్పుడు ఉనికి గలవియే. అవి ఉత్పన్నము కావు, నాశనమునూ కావు. అవి శాశ్వతము. గతిశీలమైన పరమాణువులందు విశేషగతిని గలిగించి తన నిరీక్షణలోనే ఈ సమస్త సృష్టిని పరమేశ్వరుడు రచించుచున్నాడు.

ఈ మంత్రము వల్ల పరమేశ్వరుడు ఈ సృష్టి రచనకు నిమిత్త కారణమని ఋజువగుచున్నది. జీవాత్మ, ప్రకృతి కూడా నిత్య సత్యములే – నాశరహత వస్తువులే. ఈరెంటి సహాయముతోనే పరమేశ్వరుడు ఈ సృష్టి రచన చేయుచున్నాడు.

## పరమేశ్వరుడున్నాడా? (ఈశ్వర అస్తిత్వము) EXISTENCE OF GOD

'పరమేశ్వరుడు' అను ఒక పదార్థము ఉన్నదా అను సందేహము కలుగవచ్చును. ఈ సందేహ నివృత్తికి అనేక శాస్త్రోపశాస్త్రములున్నవి. ఇక్కడ ఒక విషయం గమనించవలయును. ఒక పదార్థము ఉత్పన్నమగుటకు దానికి కావలసిన వస్తు సామగ్రి అంతకుముందే ఉండి ఉండవలయును. దాని మూలకముగానే ఆ వస్తువు ఉత్పత్తి సంభవమగును. ఈ సృష్టిరూప వస్తు నిర్మాణమునకు పూర్వమే పరమ జ్ఞానమయము, చేతనము, వివేకవంతమైన పదార్థము ఉండుట ఆవశ్యకము. పరమ జ్ఞానమయుడయినవాడే ఈ సృష్టిని నిర్మించగల సమర్థుడు. అతనినే పరబ్రహ్మ, పరమేశ్వరుడు మొదలగు పేర్లతో పిలుతుము.

ఈ సృష్టిరూప రచనయే పరమేశ్వరుని ఉనికికి మరొక నిదర్శనము. వేదాంతదర్శనకారుడు "జన్మాద్యస్య యతః" ఈ జగత్తుకు ఉత్పత్తి, స్థితి, లయములు కలిగించువానినే ఈశ్వరుడందురని వ్యాఖ్యానించినారు. ఈ సృష్టి రచనను నిశితంగా పరిశీలించినచో యిది ఒక జ్ఞానవంతుడి రచనయే అని అర్థమగును. ఉదాహరణకు ఒక నిర్జన అరణ్య ప్రాంతమున ఒక సుందరమైన భవనము, దానిచుట్టూ పుష్ప వాటికలు, బావులు, చెరువులు మరియు భోజనమునకు కావలసిన వస్తువులను చూచినపుడు అక్కడ మానవులెవ్వరు కనబడకపోయిననూ అక్కడి ఏర్పాట్లను చూసి ఎవరో బుద్ధిమంతుడైన వ్యక్తి ఈ నిర్మాణములను – ఏర్పాట్లను చేపట్టి యుండవచ్చునని అనుమానించగలము. మట్టి, ఇటుకలు, నీరు మొదలగు వస్తువులు స్వయముగా తామంతట తామే కలిసిపోయి భవనమేర్పడును కదా? ఒకవేళ అలా జరుగగలిగితే నేడునూ లక్షలకొద్ది భవనములు ఏర్పడవలెను. కాని అలా జరుగుటలేదు. రామాయణ, మహాభారతాది గ్రంథములందలి అక్షరములన్నింటినీ ఒక్కొక్కటిగా కత్తిరించి ఒక పాత్రలో వేసిన ఆ అక్షరములు తమంతటతామే శ్లోకములుగా మారవు కదా! అట్లే పరమాణువులు అస్తిత్వము గలవైనప్పటికీ స్వయముగా సృష్టిరూపమున మార్పు చెందలేవు. కావుననే వీటిని జోడించి సృష్టి నిర్మాణము చేయుటకు ఈశ్వర అస్తిత్వమును అంగీకరించవలసి యున్నది.

పరమేశ్వరుడు తననుండే ఈ సృష్టిని రచించెనని భావించిననూ నది సరికాదు. తననుండే – తన శరీరమునుండే సృష్టిని రచించెనని భావించిన అప్పుడతడు వికారి–మార్పు చెందినవాడగును. అప్పుడు ఈశ్వరుని వలెనే ఈ సృష్టి కూడా పవిత్రము, జ్ఞానమయము కావలసి వచ్చును. అయినా ఈశ్వరునకు శరీరము లేదు కదా, అతడు అశరీరి (అకాయం). శరీరధారి అయినవాడు సర్వ వ్యాపకుడు కాజాలడు. ఈశ్వరుడు సర్వవ్యాపకుడు కదా!

జడము, అచేతనము, శాశ్వతము అయిన దానికి ప్రకృతి యని పేరు. వేదములందు ప్రకృతికి 'అదితి' అని పేరు. సృష్టి జడచేతన మిశ్రితము. కావుననే జడమున కంటే భిన్నమైన ఒక చేతన తత్వము ఉన్నదని ఊహించవచ్చును. దానిపేరే జీవాత్మ. ఈ ప్రకృతి, జీవుల సహాయముతోనే పరమేశ్వరుడు ఈ సృష్టి రచన చేయును. పరమేశ్వరునిలో ఎలాంటి మార్పు జరుగదు. అతడు ఎల్లప్పుడు ఏకరసుడై యుండును. ఉదాహరణకు 'మార్పు' అనగా పాలనుండి పెరుగు, నీటినుండి ఆవిరి ఏర్పడటాన్నే 'మార్పు' అంటాము. జీవుడు కూడా తన స్వరూపము నుండి మార్పు

చెందదు. ప్రకృతి మాత్రమే మార్పు చెందు స్వభావము కలది. ఈ ప్రకృతియే ఒకచోట సూర్యుని రూపమున మహాగ్నిగా, మరొకచోట జలమయ సముద్రముగా, ఇంకోచోట సుందర మానవ శరీరములుగా, మరోచోట అందమైన పుష్పములుగా మార్పు చెంది తన సువాసనను వెదజల్లుతున్నది. ఈ ప్రకృతియే ఒకచోట అడవిలో జింక శరీరము దాల్చి పరిగెత్తుచున్నది. అక్కడే సింహపు శరీరముతో ఆ మృగమునే– ఆ జింకనే వేటాడి తినుచున్నది. ఆ పరమేశ్వరుడి లీలలు ఎన్నని చెప్పగలము. ప్రకృతి ద్వారా తన అద్భుత లీలలను ప్రదర్శించుచున్నాడు. చేతనుడు, జ్ఞానమయుడైన వ్యవస్థాపకుడు లేకుండా జడము, జ్ఞాన రహితమూ, వివేకశూన్యమూ అయిన ఈ ప్రకృతి యింతటి నియమబద్ధ వ్యవహారమును – లీలలను చూపగలదా!

కొన్ని పరమాణువుల కలయిక ద్వారా సుగంధభరిత పుష్పములు, ఆకులు, కొమ్మలు, విత్తనములు ఏర్పాటు చేయుట ఈ జడ ప్రకృతికి ఎలా సాధ్యం! కేవలము పరమాణు సముదాయమువల్ల యిది సాధ్యము కాదు. ఈ వ్యవస్థనంతటినీ నడిపించుటకు ఒక గొప్ప చేతన, జ్ఞానమయ తత్వము యొక్క అస్తిత్వపు అవసరము ఎంతైనా కలదని సిద్ధించుచున్నది.

ఒక బూడిద గుమ్మడి విత్తనమును సారవంతమైన పొలమునందు నాటి మంచి పోషణ నిచ్చిన అది సుమారు ఒక వేయి గుమ్మడికాయలనిచ్చును. ఒక్కొక్క గుమ్మడి కాయలో సుమారు 100 విత్తనములనుకొన్ననూ లక్ష విత్తనములగును. ఈ లక్ష విత్తనములను మళ్ళీ నాటుతూ పది సంవత్సరములపాటు యిట్లు చేసిన ఆ గుమ్మడి తీగలు ఎంత భూమని ఆక్రమించునో ఊహకందదు. ఒక వంద సంవత్సరములట్లు చేసిన భూమిపై స్థలమే మిగలదు. ఇది ఒక అద్భుతమైన, ఆశ్చర్యకరమైన లీల. ఒక్క విత్తనములో యింతటి శక్తి దాగియున్నది. విత్తనము చాలా చిన్నది. కాని దాని తీగలు ఎంతో దూరము విస్తరించును. ఆ తీగలను తూకము వేసిన ఎన్ని క్వింటాళ్ళ బరువు తూయగలదో చెప్పలేము. ఇంత వృద్ధి ఎలా జరిగింది. ఒక అదృశ్య శక్తివల్లనే విత్తనము నుండి మొక్క వచ్చి రెండు మూడు మాసములలోనే పెద్ద లతగా / తీగగా మారును. ఒక విత్తనము భూమి, జలము, అగ్ని వాయువుల సహాయముతోనే తనలాంటి – తన గుణములతో కూడిన లత లేదా వృక్షరూప మార్పును పొందును. మిరప విత్తనము తనలాంటి కారముగల మార్పును, ద్రాక్ష విత్తనము తియ్యని మార్పును, వేప విత్తనము చేదు మొదలయిన ఆశ్చర్యకరమైన మార్పులను ఆయా విత్తనములలో చూడనగును. ఆయా విత్తనములలో అలాంటి అద్భుత వ్యవస్థను ఎవడు చేశాడో అతడే పరమేశ్వరుడు. అతడే ఈశ్వరుడనబడును. ఆ పరమేశ్వరుడే జీవ ప్రకృతుల ద్వారా ఆ గొప్ప వ్యవస్థను ప్రకటపరచుచున్నాడు. ప్రకృతి నుండే భూమి, జలము, అగ్ని, వాయువు మున్నగునవి ఏర్పడినవి. సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు మరియు బ్రహ్మాండమంతయు ఆ ప్రకృతి యొక్క వికారములే – అనగా మార్పు చెందిన రూపములే.

## భూమ్యాదుల ఉత్పత్తి : EVOLUTION OF EARTH AND OTHER PLANETS

‘భూమి’ మొదలగు గ్రహోపగ్రహముల ఉత్పత్తి గురించిన వర్ణన వేదములలో స్పష్టముగా వ్రాయబడియున్నది. కొద్ది కొద్దిగా మార్పు చెందుతూ భూమి ప్రస్తుత రూపమును పొందినది. భూమి మొదట సూర్యుని వలె మండుచుండెడిది. భూమి లోపల యిప్పటికీ అగ్నిని చూడవచ్చును. భూమిపై కొన్ని ప్రాంతములలో నేటికీ ‘లావా’ రూపములో అగ్ని బయటకు వచ్చుటను గమనించవచ్చును. వీటినే “జ్వాలాముఖీ” పర్వతములందురు. కొన్నిచోట్ల భూమినుండి వేడినీరు బయటకు వచ్చుచుండుట కూడా గమనించవచ్చును. దీనికి కారణము కూడా భూమి లోపలి పొరలలో ఉన్న అగ్నియే కారణము. కాలక్రమేణ భూమి చల్లబడి దానిపై జీవ జంతువుల ఉత్పత్తి ప్రారంభమైనది. కొన్ని లక్షల సంవత్సరాల కాలంలో అగ్నిగోళముగా నున్న భూమి ప్రస్తుత ఈ దశకు చేరుకొన్నది.

ఇందుకు వేదమంత్ర ప్రమాణము:

**ఓం సూర్యా చంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్ ।**
**దివంచ పృథివీంచాంతరిక్షమథో స్వః ॥**

– ఋ. 10.190.3

**అర్థము:** పరమేశ్వరుడు సూర్యుడిని, చంద్రుడిని, ద్యులోకమును, పృథివీ లోకమును, అంతరిక్షమును పూర్వము వలెనే అనగా పూర్వపు సృష్టిలో వలెనే ఉత్పన్నము చేసి, మానవుల సుఖము కొరకు అన్నిరకముల పదార్థములను నిర్మించియున్నాడు.

## పురాణాలలో భూమి పుట్టుక

సృష్టి విజ్ఞానము తెలియక పురాణములలో భూమి పుట్టుక గురించిన అసంభవమైన కథలను కల్పించి ప్రజలను అజ్ఞానపూర్వకమైన భ్రమలో ముంచియున్నారు. దేవీ భాగవతము, పద్మ పురాణము మొదలగు పురాణములలో ఈ క్రింది కథను కల్పించి యున్నారు. మొట్టమొదట విష్ణువు జలమును సృష్టించి ఈ జలమందే విశ్రమించెను. అతని నాభి కమలమునుండి జలముపై బ్రహ్మ పుట్టెను. ఆ బ్రహ్మ కమలముపై కూర్చొని నేను ఎక్కడినుండి వచ్చాను? నా పనేమిటి? అని ఆలోచించునంతలోనే యిద్దరు దైత్యులు – రాక్షసులు మధు, కైటభ పేరు గలవారు విష్ణువు యొక్క చెవి మలము నుండి పుట్టి (విష్ణు కర్ణమలోద్భుతౌ) జలముల పైకి వచ్చి బ్రహ్మను కమలముపై ఉండుటను జూసి యిట్లనిరి. నీవు కమలముపై నుండి దిగిపొమ్ము మేము దానిపై కూర్చొనెదమని వాదులాడసాగిరి. బ్రహ్మ దానిని అంగీకరించలేదు. కావున వారి మధ్య యుద్ధము జరుగసాగెను. అంతట బ్రహ్మ యొక్క అభ్యర్థన మేరకు విష్ణువు వచ్చి ఆ రాక్షసులిద్దరిని మోసముతో చంపివేసెను. అప్పటినుండి విష్ణువు 'మధుసూదనుడి'గా పిలువబడసాగెను. మధు, కైటభుల వధ వల్ల, వాటి శరీరమునుండి కారిన రక్తము, మజ్జా, మాంసములు ఆ జలముపై పేరుకొని భూమి ఏర్పడినదందురు. భూమి వీటి మేదా మజ్జా వల్ల ఏర్పడినది కావున భూమికి 'మేదినీ' అను పేరు వచ్చినదందురు.

దేవీ భాగవతమందు:

**"మధుకైటభయోరాసీన్మేదసైవపరిప్లుతా ।**
**తేనేయం మేదినీ దేవీప్రోచ్యతే బ్రహ్మావాదిభిః ॥** అని వ్రాయబడియున్నది. శబ్దకల్పద్రుమము మున్నగు శబ్దకోశములందు మేదినీ శబ్దమునకు ఈ శ్లోకమునే ప్రమాణముగా చూపింతురు.

మొదట సృష్టి జలముతో ప్రారంభమైనదను ఈ పురాణ కథ ఒక మిథ్యా ప్రలాపమే. జలరాశి సముద్రముగా మారి అందు విష్ణువు విశ్రమించి యుండిన ఆ సముద్రము దేని ఆధారముగా నుండెను? భూమి నౌక వలె సముద్రమునందు తేలియాడుచుండెనని లేదా శేషనాగు శిరస్సుపై లేదా కూర్మము యొక్క వీపుపై యుండెనని అజ్ఞానులైన పౌరాణికులు వారి అనుయాయులు భావింతురు.

మధు, కైటభముల రక్తము, మజ్జా, మాంసములతో భూమి ఏర్పడినదనిన ఆ మధు కైటభముల శరీరములు ఎక్కడినుండి, ఏ పదార్థములనుండి పుట్టినవి? విష్ణువు శరీరమును ధరించి యుండిన అతడి శరీరము ఏ ఏ ధాతువుతో ఏర్పడినవి? విష్ణువు చెవిలో మలము ఎక్కడినుండి వచ్చినది? కమలము ఎట్లు వచ్చినది? అది ఏ ఏ పదార్థములతో ఉత్పన్నమైనది? అను నీ ప్రశ్నలకు సమాధానములు లేవు. దీనిని బట్టి పౌరాణికులు చాలా అజ్ఞానాంధకారములో మునిగియుండిరనుటలో సందేహమిసుమంతయు లేదు.

## సూర్య చంద్రుల పుట్టుక : EVOLUTION OF SUN & MOON

పురాణాలలో సూర్య చంద్రుల పుట్టుకను గురించిన కథలు చాలా విచిత్రముగా నున్నవి. 'కశ్యపుడు' అను

ఋషికి, అదితి, దితి, దను, కద్రువ, వినత మొదలగు అనేకమంది భార్యలుండిరి. అందులో 'అదితి' అను స్త్రీ వల్ల ఆదిత్యుడు అనగా సూర్యుడు, చంద్రుడు, నక్షత్రములు మొదలగునవి ఉత్పన్నమైనవి.

భాగవత పురాణమున అత్రి ఋషి నేత్రము నుండి చంద్రుడు ఉత్పన్నమైనట్లు చెప్పబడినది.

**అథాతః శ్రూయతాం రాజన్ వంశః సోమస్య పావనః ।**

**యస్మిన్నైలాదయో భూపాః కీర్త్యంతే పుణ్యకీర్తయః ॥**

**సహస్ర శిరసః పుంసో నాభిహ్రదసరోరుహాత్ ।**

**జాతస్యాసీత్సుతో ధాతురాత్రిః పితృసమో గుణైః ॥**

**తస్య దృగ్భ్యోఽభవ త్పుత్రః సోమోఽమృతమయః కిల ।**

**విప్రోష ధ్యుడుగణానాం బ్రహ్మణా కల్పితః పతిః ॥"**

చంద్రుడు సముద్రము నుండి ఉత్పన్నమైనట్లు కొందరు చెప్పుదురు. మేఘములు ఎట్లేర్పడుచున్నవి? గాలి ఒకప్పుడు వేగముగాను, మరొకసారి మందమందముగాను ఎందుకు వీయును? భూమి నుండి వెలువడు వేడి జలములు మరియు అగ్ని శిఖలు / జ్వాలాముఖీ ఏమిటి? భూకంపములెందుకేర్పడుతాయి? విద్యుత్ ఏమిటి? మేఘములలో భయంకరమైన గర్జన లెందుకు వస్తాయి. ఈ విషయములన్నింటినీ విజ్ఞానశాస్త్రము ద్వారా మానవులందరు తెలుసుకోవలయును.

**"న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే."**

జ్ఞాన సముపార్జనయే మానవునికి ప్రధాన కర్తవ్యము. జిజ్ఞాస విషయమును తెలుసుకోగోరటం మానవునికి పరమ ధర్మము. వేద శాస్త్రములలో దీని గురించే పలు రకములుగా చర్చించబడినది. మనచుట్టూ ఎన్నో పదార్థములను గమనింతుము. వాటిని పరిశీలనాత్మక దృష్టితో చూసి వివేచించవలయును. ఆకాశమునందు చుక్కలు పెద్దవి, చిన్నవిగా వనమునందు వృక్షములవలె పంక్తి బద్ధముగా కనబడును. భూమికి అవి ఎంత దూరములో నున్నవి? నక్షత్రములతో పోల్చిన చంద్రుడు ఎందుకు పెద్దగా కనబడదు? నక్షత్రములు తమ రూపములనెట్లు మార్చును? గ్రహములన్నీ తూర్పు దిక్కునుండి పడమటికి ప్రయాణించుచున్నట్లెందుకు కనబడును?

వర్షాకాలంలో మేఘములు భయంకరముగా గర్జించి, పిడుగుపాటుకు గురియై పెద్ద పెద్ద మేడలు, పెద్ద వృక్షములు కూడా కూలి, కాలిపోవుచుండును. మనుషులు కూడా పిడుగుపాటుకు గురియై మరణింతురు. ఆ పిడుగు రూప విద్యుత్ ఎక్కడినుండి ఎలా పుడుతుంది? మేఘములెలా ఏర్పడుతాయి? అంత నీరు ఆకాశమునందు ఎక్కడినుండి జమకూడుతుంది? మేఘములు ఆకాశమునందు దేని ఆధారమున పరిగెత్తుచుండును? వనగండ్లు ఎట్లేర్పడును? అంతలోనే మేఘములు ఎలా మాయమవుతాయి? ఈ విషయములన్నీ తప్పక తెలుసుకోదగ్గవే కదా.

ఇవియన్నియు పరమేశ్వరుని లీలలు. వీటిని ఎరుగక పరమేశ్వరుని ఎరుగుట అసాధ్యము. స్వయముగా వేదమే మనుష్యులను జిజ్ఞాసపరులను చేసి వారిని జ్ఞానవంతులను జేయును. జిజ్ఞాసయే మానవులకు పరమ ధర్మము.

ఈ ప్రపంచమున పరమేశ్వరుడు కన్నులకు కనబడడు కాని అతని లీలలు ఈ సృష్టిలో అణువణువున కనబడుచునే యుండును. కావుననే ప్రాచీన ఋషులు...

**"ఆరామమస్య పశ్యంతి న తం పశ్యంతి కశ్చన"** అన్నారు.

అతడి సృష్టి వైచిత్రిలోనే అతనిని చూడగలుగుతాము. సాక్షాత్తు కన్నులతో పరమేశ్వరుని చూడలేము.

సృష్టి నిర్మాణమునకు అవసరమైన మూల పదార్థములను గూర్చి అధ్యయనము చేయుట ద్వారానే పరమేశ్వరుని

తెలుసుకొన ప్రయత్నించవలెను. కావుననే వేదాంత దర్శనకర్త వ్యాసుడు బ్రహ్మ లక్షణమును తెలుపుతూ –

**"జన్మాద్య స్య యతః"** అను సూత్రములో సృష్టి ఉత్పత్తి, స్థితి, లయము చేయువాడే బ్రహ్మమని సూత్రీకరించినాడు. బ్రహ్మకు, జగత్తుకు గల సంబంధమును స్పష్టీకరించినాడు. సృష్టి నిర్మాణమును తెలుసుకొన్నచో ఈశ్వరుని ద్వారా చేయబడిన ఈ సృష్టిని తెలుసుకొన్నట్లే కదా! ఇది గొప్ప విషయమే కదా!

కావున మానవులు ఈశ్వరుని రచన అయినట్టి ఈ సృష్టి నిర్మాణము వైపు ధ్యానము మరల్చి జిజ్ఞాసపరులై తద్వారా పరమేశ్వర సాక్షాత్కారమునకు ప్రయత్నించవలయును.

**"ఇతి శమ్"**

